

*Chandamama Nov. '47* — *Photo by Moorthy Vasan*

చందమామ అల్లుడు, కోడలు

# చందమామ

## (నవంబరు సంచిక ప్రచారము)



| | |
|---|---|
| 1. తెనాలి | 1,200 |
| హిగిన్‌బాథంసు స్టాల్ | 200 |
| 2. బెజవాడ | 1,000 |
| స్టాల్ | 300 |
| 3. గుంటూరు | 600 |
| స్టాల్ | 100 |
| 4. రాజమండ్రి | 750 |
| స్టాల్ | 150 |
| 5. మద్రాసు | 1,500 |
| స్టాల్ | 250 |
| 6. వాల్తేరు | 500 |
| 7. విజయనగరం | 500 |
| స్టాల్ | 50 |
| 8. ఏలూరు | 400 |
| స్టాల్ | 50 |
| 9. గుడివాడ | 200 |
| స్టాల్ | 150 |
| 10. సామర్లకోట | 150 |
| స్టాల్ | [illegible] |
| 11. కడప | 100 |
| స్టాల్ | 100 |
| 12. కాకినాడ | 600 |
| 13. బందరు | 300 |
| 14. అనకాపల్లి | 300 |
| 15. నెల్లూరు | 400 |
| 16. నిడుద్రోలు | 300 |
| 17. తాడేపల్లిగూడెం | 250 |
| 18. సికింద్రాబాదు | 300 |
| 19. బాపట్ల | 150 |
| 20. కంకిపాడు | 100 |
| 21. చల్లపల్లి | 100 |
| 22. వరంగల్లు | 100 |
| 23. కర్నూలు | 150 |
| 24. [illegible] | 100 |
| 25. బొంబాయి | 150 |
| 26. కలకత్తా | 100 |
| 27. వీలర్ స్టాళ్ళు | 250 |
| స్వదేశమిత్రా స్టాళ్ళు | 210 |
| హిగిన్‌బాథంసు స్టాళ్ళు 17 స్టాళ్ళు | 400 |
| ఇతర 82 ఏజెన్సీలు చందాదార్లు, వగైరా | 5,670 |
| మొత్తం కాపీలు | 18,000 |

## చదువుకోండి



---


సాలు చందా 6-0-0 **చందమామ** విడి ప్రతి 0-6-0

పిల్లల మాసపత్రిక


### గమనిక.

★ 1-11-47 నుండి సంక్రాంతి ప్రత్యేక సంచికతో సహా ఆరు రూపాయలు. చందాదారులకు సర్టిఫికేట్ ఆఫ్ పోస్టింగ్ తో పంపుతాము. మరల మరల కాపీలు పంపబడవు. రు. 2-4-0 అదనంగా పంపితే ప్రతినెలా రిజిష్టర్ లో పంపగలము. చందానంబర్లు ఉదహరించని ఉత్తరానికి జవాబు ఉండదు. మాదిరి ప్రతి, వి. పి. లు పంపబడవు.

★ చందమామలో పిల్లల రచనలూ, ఫొటోలూ ప్రకటిస్తాము. చక్కని కార్డుసైజు ఫొటోలు, 0-0-9 టిక్కెట్లతో పంపండి. ప్రచురిస్తే తెలుపుతాము. లేకపోతే తిప్పి పంపుతాము. రచనలతో స్వంత అడ్రసు వ్రాసి, టిక్కెట్లు అంటించిన కవరు పంపాలి. ప్రచురించని రచనలు తిప్పి పంపుటకు లేదా ప్రచురించే విషయం తెలుపుటకు వీలుంటుంది.

ఈ సంగతులు గమనించి సాయపడండి.


ఆఫీసు: 37, ఆచారప్పన్ వీధి, మద్రాసు 1




పిల్లల మాసపత్రిక

సంపుటి 1 | 1 నవంబరు 1947 | సంచిక 5

## పాపలూ!

మీ దీపావళిపండుగ వచ్చింది. నిజానికి మన హిందువుల పండుగలలో వినాయకచవితి, మహర్నవమి, దీపావళి ఈ మూడూ ముఖ్యంగా మీ పండుగలే. దీపావళినాడు మీరు కిపిటీలు తిప్పుతారు; మందుసామాను కాలుస్తారు. ఎంతో ఉల్లాసంతో రాత్రి పొద్దుపోయిందాకా ఆడుతుంటారు; నిద్రపోతారు.

కాని, ఆ ఒక్కరాత్రి మీరు ఎంత డబ్బు ఖర్చుపెడతారో మీలో ఎవరైనా యోచించారా? కొన్ని లక్షలు ఉంటుంది, ఒకవిధంగా అది అంతా వృధాఖర్చే. మీరు ఖర్చుపెట్టేదానిలో నాలుగోవంతైనా బీదపిల్లలకు దానంచేస్తే వాళ్లు చదువుకుని దేశానికి ఎంతో సహాయపడతారు. చెప్పండి, నిజమా, కాదా?



ఇలా బాధలు లోకాలు ఎంత కాలం సహిస్తాయి. దేవతలదగ్గరనుంచి బ్రహ్మ దాకా అంతా కృష్ణభగవానుని ప్రార్థించారు. అప్పుడు కృష్ణుడు సత్యభామతో సహా గరుత్మంతునిమీద ఎక్కి నరకాసురునిపై యుద్ధానికి బయలుదేరాడు.

కృష్ణునికీ, నరకాసురునికీ యుద్ధం ఘోరంగా జరిగింది. కృష్ణుడు యుద్ధంలో మూర్ఛపోయాడు. కృష్ణునికి తెలివివచ్చే వరకూ సత్యభామ చాలా సాహసంతో రథంనడిపి నరకాసురుడితో యుద్ధం చేసింది. ఆతర్వాత కృష్ణుడు సుదర్శనచక్రంతో నరకుని తల నరికివేశాడు. ఆనాడు చతుర్దశి. అందువల్లనే ఆ చతుర్దశి నరక చతుర్దశి అయింది. ఆనాడు లోకకష్టాలు తీరినాయి కొబట్టి నరకచతుర్దశి పండుగ అయింది. నాటినుంచి మనం ఆపండుగ యేటేట జరుపుకొంటున్నాము.




అక్కతోడా నీవు బండెక్కి వస్తే
ఆనంద మౌతుంది అందరికి బావ!

మొలక నవ్వుల నిన్ను పలకరిస్తాను
అమ్మ నాన్నా నిన్ను ఆదరిస్తారు
చుట్టుపక్కాలు నిను చూడవస్తారు
మేలైన వాడవని మెచ్చుకుంటారు.

అక్కను నీవెంట కొనిరాక బావ
బిక్కుబిక్కుమంటు ఒక్కడవు వస్తే,
చిత్తమొల్లాదోయి క్షేమంబు లడుగ
మనసు పుట్టాదోయి మర్యాదచేయ!

అక్క నుంచేగద బావ చుట్టంబు
ఆళ్లనుంచేగద తిరుగలి చుట్టంబు
అన్నసామెత మనలో ఉన్నదంచూను
ఎఱుగవోయీ నీవు వెఱ్ఱి మాబావ!

కనుపర్తి వరలక్ష్మమ్మ




## మామయ్య

మామయ్యెంతో మంచోడే
మాటాడిస్తే మంచోడే.
నోట్లో నాలుక లేకున్నా!
నూటికి సర్దారైనాడే.
ఊరూ పేరూ లేకున్నా!
ఉండీలే దిగమ్రింగాడే.
అట్టేపిలుపే లేకున్నా!
అంగలు పంగలు వేస్తాడే.
గాలికి కొట్టుకు పోతున్నా!
గప్పాలూరక కొడతాడే.





తలుపూ మాటుకు లాగండే
తప్పెట దరువూ వేయండే
గోడా చాటుకు దీయండే
గ్రుద్దుల బెల్లం బెట్టండే
తమ్ముల పాకు లీయండే
సొమ్మూ సొత్రూ లాగండే
మంచీ గంధం పూయండే
మానవా గాయను చేయండే.

పని పాటంటే మామయ్యా!
ప్రాలు మాలెద వేమయ్యా!

తిండీ తిప్పలకుం డంటే,
గండు బిల్లి లా గొస్తా వే!
చెయ్యని పెట్టని అయ్యలకే,
రొయ్యల మీసం గావాలె!
కావలసిన పని చేయాలె,
కడుపు కింత తిని తిరగాలె!
మంచీచెడ్డలు తెలియాలె,
మా రాజను పేరుండాలె!

—ఏటుకూరి రవీంద్రం






ఎవడు లోకువంటే బండరామాయి లోకువన్నట్టయింది నాపని. నాకు సరిగా బుద్ధితెలియకమునుపే మా వాళ్ళు నన్ను మొద్దువెధవకింద రూఢిపరిచారు. మా చుట్టుప్రక్కలవాళ్ళూ, బంధువులూ, స్నేహితులూ, నా మేస్టర్లూ, తోటివిద్యార్థులూ అందరూ నన్ను బండరాముడనే పిలిచి, బండరాముణ్ణి చూసినట్టేచూశారు.

మొదట్లో నేనుకూడా అందరిమాటా నమ్మాను. నిజంగానే నేను బండవెధవ ననుకున్నాను. అందరికీ లోకువగా పడి ఉన్నాను. అందరిపనులూ చేశాను. కాని నన్ను గురించి అందరూ అనేది నిజంకాదని నాకు క్రమక్రమంగా రుజువు కాసాగింది. వాళ్ల మాటలు అబద్ధమని వాళ్ళనోటనే పలికించాలని బుద్ధిపుట్టింది. ప్రపంచంమీద తిరగబడ్డాను. నామీద రౌడీతనం చేసినవాళ్ళని తన్నాను. నన్ను మోసంచేసినవాళ్లని పరాభవించాను. గోపీగాని, కిష్టుడుగాని, శృంగారం మేష్టారుగాని నన్నుగురించి వెనకటి లాగా అనుకోవలసిన అవసరంలేదు.

ఒకచిత్రం గమనించారా? ప్రపంచం ఒకణ్ణిపట్టుకుని "బండ, మొద్దు," అని సులభంగానే అంటుందిగాని, తెలివిగల వాడుంటే వాడి తెలివితేటలు చప్పున గ్రహించలేదు. మనవాణ్ణే దూరపు మనుషులు గొప్పవా డనేదాకా మనం వాడి గొప్పతనం తెలుసుకోం. ప్రపంచంకన్న "మొద్దు" ఎవరూ ఉండరని నా అభిప్రాయం. నేను క్లాసులు పాసవుతూనే ఉన్నాను. నాకు క్లాసులో ఫస్టు మార్కులు కూడా వచ్చాయి. కాని నన్నందరూ ఇంకా బండరాముడనే పిలుస్తున్నారు. హేళన చేస్తున్నారు. నా మీదికి ఒంటికాలిమీదవస్తూనేఉన్నారు.

నేను నాలుగో క్లాసు పాసయి అయిదోక్లాసులోకి వచ్చిన కొత్తలో ఒక తమాషా జరిగింది. నన్నుగురించి సాటి విద్యార్థులు అభిప్రాయం మార్చు

కునేటందుకు ఇది మంచి అవకాశం.



మా స్కూలు తెరిచిన కొత్తలో మా వూళ్లో ఒక ఎగ్జిబిషను పెట్టారు. ఎక్కడలేని షాపులూ వచ్చాయి. ఊళ్లో ఉన్నవాళ్లందరూ తిరణాళకు పోయినట్టుగా వేడుకలు చూడబోయినారు. ఎన్నడూ కనీ వినని వస్తువులన్నీ కొనుక్కురాసాగారు. నాకూడా ఏమైనా కొందామనిపించింది; కాని రూపాయో, రెండో లేకుండా కొనటాని కేముంటుంది ?

ఉన్న షాపులు చూసి అయినా సంతోషింతామని నేనూ ఒకరిద్దరు స్నేహితులూ కలిసి ఎగ్జిబిషనుకు బయలుదేరాం. షాపులన్నీ చూస్తూ వెళ్లాం. అక్కడ ఒకషాపులో ఒక మంచి చాకు కనిపించింది. దాని పిడి ఎంతో అందంగా ఉంది. దానిలో చాకు కాక ఒక ముల్లూ, ఒక బిరడాలుతీసే మరా, మర మేకులు బిగించే స్క్రూడ్రైవరూ ఉన్నాయి. చూడగానే ఆ చాకు కొనుక్కోబుద్ధిపుట్టింది. కాని ఏంచెయ్యను ? దాని ఖరీదెంత అని అడిగితే షాపువాడు, "కారుచౌక! రూపాయిన్నర! కావలిస్తే కొనుక్కో! ఇటువంటి చాకులు డజను తెప్పించాను. ఇదొక్కటుంది." అని నన్ను వెర్రెత్తించాడు. నా వెంట వచ్చిన నాగభూషణం జేబులోనుంచి రూపాయిన్నరతీసి ఆ చాకు కొన్నాడు.

"ఏదిరా ? నన్నొకసారి చూడనీ," అని నాగభూషణం దగ్గిర చాకు తీసుకుని ఎంతో ఆనందంతో దాన్ని పరీక్షించ సాగాను. చివరకు వాడి చాకు వాడి కిస్తూ, "నాదగ్గిర డబ్బులేవుగాని ఉంటే తప్పక కొనిఉందును," అన్నాను.

నేనీమాట అంటుండగా నా వెంట ఉన్న మరో కుర్రవాడు రహస్యంగా, "లెక్కల మేష్టారు," అన్నాడు. నేను తల ఎత్తి చూసేసరికి మా పక్కగా



లెక్కలమేష్టారు పోతున్నారు. ఆయన మాకేసి చూసి నవ్వారు. నామాటలు ఆయనకు వినపడి ఉండాలి.

ఆరోజు బడిలో నాగభూషణం తన కొత్తచాకును పిల్లలందరికీ చూపించాడు. దానితో అందర్నీ పెనసళ్ళు చెక్కుకోనిచ్చాడు. ఆ సాయంత్రం బడి వదిలి నేను ఇంటికి పోతుండగా బడి నౌకరు నావెంట వచ్చి నా చేతికి ఒక అందమైన పాకెట్టు ఇచ్చాడు. ఇంటికి పోయి విప్పదీసి చూతునుగదా, నాగభూషణం కొన్నటువంటి చాకే. అయితే దీని పిడిమీద నా పేరు పొడి అక్షరాలున్నాయి. "లెక్కల్లో ఫస్టుమార్కు తెచ్చుకున్నందుకు," అని లోపల చీటీ పెట్టిఉంది. నా సంతోషం ఏంచెప్పను!

మర్నాడు పెందలాడే బడికివెళ్ళి క్లాసులో కూచున్నాను. నా కొత్త చాకు తీసి పెనసలు ముక్కు చెక్కుకుంటుండగా నాగభూషణం వచ్చాడు. నాచేతిలో చాకు చూస్తూనే అమాంతం మీదపడి లాక్కోబోయినాడు. నేను వాణ్ణి తోసేసి చాకు మడిచి జేబులో పెట్టుకుని, "ఏమిటి నీ ఉద్దేశం?" అన్నాను.

"నా చాకు నువే కాజేశావు. నాది పోయింది. అంతటా వెతికాను. దొరకలేదు. నాది దొంగిలించావు. లేకపోతే నీకెక్కడిది?" అన్నాడు నాగభూషణం.

"ఇది నాకు బహుమానం. నీది పారేసుకుంటే దానికి నన్నేం చెయ్యమంటావు?" అన్నాను.

నాగభూషణం నన్ను నానా మాటలూ అని మీదపడ్డాడు. ఇద్దరమూ చచ్చేటట్టు తన్నుకున్నాము. ఇది చూసి హెడ్మాష్టరుగారు మమ్మల్నిద్దర్నీ పిలిపించారు. ఆయన ఎదట నాగభూషణం నన్ను దొంగగా నిరూపించాడు. నేను కూడా నిజమే చెప్పాను.

అంతా విని హెడ్మాస్టరుగారు, "ఇది రాముడి చాకే. కిందటేడు లెక్కల్లో ఫస్టుమార్కు తెచ్చుకున్నందుకు లెక్కల మేష్టరుగారు వాడికి బహుమానం ఇచ్చారు. నీ చాకు నువు ప్లేగ్రౌండులో పారేసుకున్నావు. నౌకరు తెచ్చి నాకిచ్చాడు. పుచ్చుకో. ఎప్పుడూ తొందరపడి ఇంకొకరిమీద దొంగతనం అంటగట్టకు," అని నాగభూషణానికి బుద్ధి చెప్పారు.



# చందమామ

దేశిరాజు భారతీదేవి.

●

నీలాల నింగిలో దేలియాడేవు
మబ్బుల్ల చాటున మాటుమణిగేవు
తళుకు చుక్కలతోడ తరలివచ్చేవు
చందమామా నీదు అందమేమందు.

కవలు నినుజూచి కిలకిల నవ్వ
మాపాప నినుజూచి మాటలు పలుకు
కవులెల్ల నినుజూచి కయితలల్లేరు
భావగీతంబాడు బావ నినుజూచి.

ప్రతినెల తరిగేవు ప్రతినెల పెరిగేవు
పదియారు కళలతో పరిఢవిల్లేవు
అందాలు చిందేవు వో చందమామ.
ఆనంద మిచ్చావు వో చందమామ.

బాలిక లీ్నమీద పాటలు పాడ
బాలురు నీపైన పద్యాలు వ్రాయ
తరుగక నీ కీర్తి కరము పెంపొంద
చందమామా నిన్ను చదివాము మేము.

## చందమామ పోటీవ్యాసం

అగస్టునెల పోటీవ్యాసాలలో రెండవ బహుమతిపొందిన "గంగులు కథ" అనే కథ ఈ సంచికలో వేశాము. దీన్ని వ్రాసింది బొడ్డా ప్రసన్నకుమారి, దుర్గాడ.

మూడవ బహుమతి "మా జాకీ" అనే కల్పనాకథకు యిచ్చాము. దీన్ని వ్రాసింది రమ, మూలపేడు. ఈ కథ వచ్చేనెల ప్రకటిస్తాము.

### పదీల జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 ప | 2 న | 3 స | 4 పం | డు | | 6 కీ |
| | 5 గ | రి | ట | | 7 వే | లు |
| 8 అం | | గ | | 9 గౌ | డు | గు |
| 10 గీ | 11 త | | | | 12 క | ర్ర |
| 13 కా | ని | ది | | 14 తొ | | ము |
| 15 ర | వి | | 16 గ | ద | 17 బ | |
| ము | | 18 పా | ద | ర | స | ము |

## 21 పేజీలోని పొడుపుపద్యములకు

### జవాబులు

1. అనాసకాయ
2. విచ్చైన
3. మొగలిపొత్తి
4. కోడిపుంజు




కోతీ కొంగా టపాకాయలుకాల్చే పందెంవేసుకున్నై.
కోతి జాగ్రత్తగా తోకను పువ్వువత్తికిచుట్టి కాల్చింది.



కొంగకూడా ముక్కుతో పువ్వువత్తి పట్టుకునికాల్చింది.
ఇంకేముంది, కాసేపట్లో కళ్ళల్లోకి పొగపోయింది; నాలిక చుర్రుమంది.



# కాలముల మహిమ



అనగా అనగా ఓవూళ్లో ఓ బ్రాహ్మ డున్నాడు. అతని తల్లి, పెళ్లాం, పెళ్లాం తల్లీకూడా అతని దగ్గరే ఉంటున్నారు. కాని అత్తకీ కోడలికీ ఒక్కనిమిష మేనా పడడంలేదు. ఓరోజు బ్రాహ్మ డింటికి రాగానే పెళ్లాం 'ఈవేళ మీ అమ్మగార్ని ఇంట్లోంచి బయటకు వ పెయ్యాలి. లేకపోతే నేను నూతిలో పడి చస్తాను' అనిఅంది. పెళ్లాం చచ్చి పోతుందేమోఅని భయపడి ఆ బ్రాహ్మడు తన తల్లిని ఇంట్లోంచి వెళ్లగొట్టడానికి వప్పుకున్నాడు. ఆరాత్రి పెందరాళే భోజనం చేసేసి తల్లి దగ్గరకు వెళ్ళి 'అమ్మాం! చెల్లెలికి జబ్బుగా ఉందిట; నిన్ను వెంటనే రమ్మంది' అన్నాడు.

'పదరానాయనా! వెళ్లివద్దాం. నన్ను వెంటనే దిగబెట్టరా' అంది తల్లి కూతురి మీద ప్రేమకొద్దీని. ఆరాత్రి రాత్రి తల్లిని తీసుకొని కొడుకు బయల్దేరాడు. మధ్య దారిలో ఓ చిన్న అడవిఉంది. ఆ అడవిలోనికి వెళ్లిన తర్వాత తల్లిని నడవమని తాను వెనకాల ఉండిపోయి ఆ బ్రాహ్మడు ఇంటికి వెళ్ళిపోయాడు.

కొడుకు వస్తున్నాడు కాబోలు అను కుంది తల్లి. కొంత దూరంవెళ్లాక వెనక్కి తిరిగిచూస్తే కొడుకులేడు. ఎంత పిల్చినా పలకలేదు. ఏడుస్తూ ఓ చెట్టుక్రింద కూర్చుంది. అక్కడకు కొంతసేపయాక వేసవి కాలం వచ్చి 'అమ్మా! అమ్మా! నేను వేసవి కాలాన్ని; మంచిదాన్నా, కాదా?' అంది. 'అయ్యో! నీవు మంచిదానవే అమ్మా. నీ కాలంలో హాయిగా ఎక్కడకేనా వెళ్లవచ్చు. నీకాలంలో పెళ్ళిళ్ళు పేరంటాళ్లు జరుగుతాయి. మామిడిపళ్లు, పనసపళ్లు దొరుకుతాయి. నీవు మంచి దానవమ్మా' అంది తల్లి. వేసవికాలం వెళ్లిపోయింది. తర్వాత వర్షాకాలంవచ్చి

ద్విభాష్యం సూర్యనారాయణమూర్తి, దుగ్గాడ.



'నేను వర్షాకాలాన్ని. నేనుమంచిదాన్నా, కాదా?' అంది. 'అయ్యో! నీవు మంచి దానవమ్మా! నీవు లేకపోతే నీళ్లేలేవు. నీరు లేకపోతే మేం బతకడం ఎలాగ! చెరువులు నిండుతాయి. నీవల్లే పంటలు పండుతాయి. నీవు మంచిదానవమ్మా!' అంది తల్లి. వర్షాకాలం వెళ్లిపోయింది.

శీతకాలంవచ్చి 'అమ్మా! నేను శీత కాలాన్ని! నేను మంచిదాన్నా, కాదా?' అంది. 'అయ్యో! నీవు మంచి దాన వమ్మా! నీ కాలంలో హాయిగా నిద్దర పోవచ్చు. జామిపళ్లు, సీతాఫలపు పళ్లు వస్తాయి. నీవు మంచిదాన వమ్మా!' అంది తల్లి. వెంటనే మూడు కాలాలు ఒక్కమారు ప్రత్యక్షమై 'నీవు మాటలాడితే మాణిక్యాలు రాల్తాయి. నవ్వితే నవరత్నాలు రాల్తాయి' అని దీవించి ఆవిడ అడక్కుండానే ఆవిడను తీసుకొనివెళ్ళి కొడుకుయింటి దగ్గర దిగబెట్టాయి. తెల్లవారగానే కొడుకూ, కోడలూ వాకిట్లోకి వచ్చి ఈవిడను చూచి నిర్ఘాంత పోయారు. 'ఎలావచ్చారు అత్తయ్యా!' అంటూ ప్రేమఉన్న దానిలా అడిగింది కోడలు. ఏదో మాట్లాడింది అత్త; మాణిక్యాలు రాలాయి. కోడలు ఆశ్చర్యపడి మాణిక్యాలు ఏరుకుంటూంటే అత్త నవ్వింది; నవరత్నాలు రాలాయి. ఇంకా ఆశ్చర్య పడింది కోడలు. అప్పట్నించీ అత్తగార్ని కొద్దిగా గౌరవించేది.







కాని ఓ పెద్ద విచారంపట్టుకుంది కోడలికి. 'ఊరాలే రత్నాలు, మాణిక్యాలు, మా అమ్మ నోటినుంచిరాలక అత్త నోటినుంచి రాల్తున్నాయి. మా అమ్మనుకూడా ఇలాచెయ్యాలి' అనుకుంది. వెంటనే మొగుణ్ణిపిలిచి తన తల్లినికూడా అడవిలో ఒదిలేసి రమ్మంది. సరేనన్నాడు బ్రాహ్మడు. ఆరాత్రి భోజనాలయాక అత్త, అల్లుడు, అడవికి వెళ్ళారు. తన తల్లిని వదిలేసినచోటనే అత్తనువదిలి అల్లుడు ఇంటికి వెళ్ళాడు. అత్త గారు ఓ చెట్టుక్రింద కూర్చుంది.

కొంత సేపయాక వేసవి కాలంవచ్చి 'అమ్మా! నేను వేసవి కాలాన్ని! మంచి దాన్నేనా?' అంది. అనగానే, 'చాల్లే!నీమంచి చెప్పక్కర్లేదు, వెధవమంచి. ఎండలు తెగకాస్తాయి. ఈ చెవి గాడుపు ఆచెవికి కొడుతుంది. మంచినీళ్ళేనా దొరకవు. వెధవకాలం, పో! పో!' అంది. వేసవికాలం వెళ్ళిపోయింది.

వర్షాకాలంవచ్చి 'అమ్మా! నేను మంచి దాన్నేనా?' అంది. 'ఛీ! ఛీ! వెధవ కాలం. వర్షాలు పట్టుకుంటే వదలవు. జారు, బురద; మడిబట్టేనా ఆరదు. ఓ ఊరు వెడదామంటే లేదు.' అంది అత్త.

వర్షాకాలం వెళ్ళిపోయింది.







శీతకాలంవచ్చి 'నేను మంచిదాన్నేనా?' అంది. 'ఛీ! ఛీ! ముండామంచి. నీమంచే చెప్పాలి. వెధవచలి. ఎంతకూ వదల్దు. ఇట్టే పొద్దు పొడుస్తుంది. అట్టే మాయమవుతుంది. ఎంతకీ తెల్లారదు. పో. పో' అంది అత్త.

వెంటనే మూడుకాలాలు ప్రత్యక్షమయి అత్తనో గాడిదను చేసేసి కూతురు గుమ్మంలో వదలిపెట్టి 'నీవు మాట్లాడితే నోట పురుగులు రాల్తాయి.' అని వెళ్ళిపోయాయి. తెల్లవార్లూ నిద్ర రేనా పట్టక 'ఎప్పుడు అమ్మ వస్తుందా? ఎప్పుడు రత్నాలు రాల్తాయా' అని చూస్తూంది బ్రాహ్మడి పెళ్ళాం. లేవగానే గుమ్మంలో గాడిద కనబడింది.

ఇదేమిటి గాడిదెలా వచ్చిందనుకుంటూండగానే ఆ గాడిద రూపంలోఉన్న ఆమెతల్లి జరిగిన సంగతంతా చెప్పింది. అలా చెపుతూంటే నోటంట పురుగులు రాల్తున్నాయి. తన అసూయవల్ల ఇలా అయిందని దుఃఖించింది ఇల్లాలు. జరిగిన సంగతి అత్తగార్ని అడిగి తెలుసుకుంది కోడలు. 'మా అమ్మనోరు మంచిది కాదు' అని ఏడ్చింది పాపం.

అంచేత కష్టంగాఉన్నా ఏకాలాన్నీ తిట్టకూడదని మొన్న వర్షాలలో మా నాన్న చెప్పాడు. నేను మీకు చెప్పాను. ఎప్పుడూ ఏకాలాన్నీ తిట్టకండేం అన్నయ్యలూ, అక్కయ్యలూ!—



# ఉండాలోయ్ ఉండాలి

పి. భానుమతి

ఫలింకు పాట
పిల్లలకు ఆట
రాజుకు కోట
ఉండాలోయ్ ఉండాలి.

అత్తకు నోరు
దేవుడికి తేరు
స్టారుకు కారు
ఉండాలోయ్ ఉండాలి.

స్టేజికి తెర
కత్తికి ఒర
చేపకు ఎర
ఉండాలోయ్ ఉండాలి.

యింటికి అమ్మ
నిమ్మకి చెమ్మ
కొలువుకు బొమ్మ
ఉండాలోయ్ ఉండాలి.

తలుపుకు గడి
దేవుడికి గుడి
అవ్వకు మడి
ఉండాలోయ్ ఉండాలి.

జూదరికి పేక
గొడ్లకి పాక
గాంధీకి మేక
ఉండాలోయ్ ఉండాలి.

అరవలకు పాగాకూ
ఆంధ్రులకు గోగాకూ
మళయాళులకు తేయాకు
ఉండాలోయ్ ఉండాలి.

# పొడుపు పద్యములు

★

పైని పెచ్చుదీసి భక్షింప మధురంబు
కాయమెల్ల ముండ్లు గల్గియుండు
కాయపైనిజూడ కనిపించు మొక్కలు
ఇందు భావమేమి, చందమామ?

—పూడిపెద్ది సత్యనారాయణ, బరంపురం.

★

ఉన్నచోట నిల్చి యొరుల దాటింతును
పరులనెక్కి యెపుడు బయనమగుదు;
నాదుకాళ్లును రెండె, నరునికాళ్లును రెండె
నన్ను దెలిసికొనుము చందమామ.

—ఆర్. అనంతరావు, కడప.

★

పచ్చన్ని పెట్టెలో విచ్చుకోనుంది
తెచ్చుకో బోతేను గుచ్చుకుంటుంది
ఎంత గుచ్చూకున్న ఏమైనగాని
తెచ్చుకొందు రదేమొ తెల్పు మామయ్యా?

—కం. లక్ష్మీనారాయణ, తాపేశ్వరం.

★

పొడలపొడల గువ్వ, పొంకమైన గువ్వ
గువ్వలోకి మొవ్వ, పురుగులుతినే అవ్వ
రాజులపొడిచే రవ్వ, రాత్రితెలిపే రవ్వ
మున్నునైన గువ్వ, నూకలుతినే తవ్వ.

—వచ్చిపులుసు అప్పారావు, చికాకోలు.

(జవాబులు ఈ సంచికలోనే ఉన్నవి)

# డబ్బిచ్చి

అనగా అనగా ఒకఊళ్లో ఒక అబ్బాయి. చాలా తెలివయినవాడు. ఒకరోజున ఎక్కడికో వెడుతూ, దోవలో మిఠాయి అంగడి కనబడితే, బుట్టెడు మిఠాయి అరువుతీసుకొని, తనపేరు "డబ్బిచ్చి" అనిచెప్పి మళ్లీ వస్తానని మిఠాయి తింటూ ఇంకోఊరు వెళ్లిపోయాడు.

కోమటి అతనికోసం చాలా సేపుచూసి ఆఖరుకు రాజుగారితో, "డబ్బిచ్చి మిఠాయి పట్టుకెళ్లాడు," అని ఫిర్యాదుచేశాడు. "ఎవరు పట్టుకెళ్లారు?" అని రాజుగారడిగారు. "డబ్బిచ్చే పట్టుకెళ్లాడు," అని చెప్పాడు కోమటి. "ఇకనేం? పద పద!" అన్నారు రాజుగారు.



ఈలోపుగా మనఅబ్బాయికి దారిలో రాజుగారి చాకలి కనపడ్డాడు.

"ఊరిబయట మిఠాయి పంచిపెడుతున్నారు. నే తెచ్చుకొన్నాను. వెళ్లి నువు కూడా తెచ్చుకో. నీమూట నేచూస్తాను. నాపేరు నిన్న మధ్యాన్నం," అని చాకలితో చెప్పాడు అబ్బాయి. చాకలి పరుగెత్తు కెళ్లాడు.

అబ్బాయి గబగబా రాజుగారి బట్టలు వేసుకుని వెళ్లిపోయాడు.



చాకలికి మిఠాయిలేదు. గుడ్డల మూట కూడా పోయింది. వాడువెళ్లి రాజుగారి దగ్గిర, "నిన్నమధ్యాన్నం నా గుడ్డలమూట ఎత్తుకెళ్లాడు," అని ఫిర్యాదు చేశాడు.

"నిన్నమధ్యాన్నం ఎత్తుకెళ్లితే ఇప్పుడు చెబుతు

ఎ. అనసూయ, రాజోలు.

న్నావా? వెళ్లు, వెళ్లు," అన్నారు రాజుగారు.

మన అబ్బాయికి తోవలో ఒక రాజుగారు గుర్రంఎక్కి కనిపించారు. "చెరువులో మంచినీళ్ళు



తాగొస్తాను. నువు చాలా మంచివాడివిలా గున్నావు. నా గుర్రం చూస్తూఉండు. నీపేరేమిటి?" అన్నారు రాజుగారు.

"నాపేరు గుర్రంవాడు," అన్నాడు మన అబ్బాయి. రాజుగారు అవతలికివెళ్లగానే అబ్బాయి గుర్రంఎక్కి మరోదేశం వెళ్ళిపోయాడు.

తరవాత రాజుగారు మంత్రిని పిలిచి, "మంత్రీ, గుర్రంవాడు గుర్రం ఎత్తుకెళ్లాడు, పట్టుకో" అన్నారు.

"గుర్రంవాడు గుర్రం ఎత్తుకుపోతే మనం కల్పించుకో కూడదు," అన్నాడు మంత్రి.

అబ్బాయి ఒక ఏటి వొడ్డుకు వచ్చాడు. అక్కడ ఏరుదాటడానికి ఒక ముసలమ్మా, ఆమె మనమరాలు చక్కనిచుక్కా కూర్చుని ఉన్నారు.

"ముసలమ్మా, మిమ్మల్ని ఏరుదాటిస్తా. ముందు పిల్లను దాటించినతరవాత నిన్ను దాటిస్తా. నాపేరు



దానిమొగుడు," అని చెప్పాడు. ముసలమ్మ 'సరే' నంది. మన అబ్బాయి పిల్లని గుర్రంమీద కూచోబెట్టుకుని ఏరుదాటించి తీసుకుపోయి దాన్ని పెళ్లాడి సుఖంగాఉన్నాడు.

"నాపిల్లను దానిమొగుడు తీసుకెళ్లాడు," అని రాజు దగ్గర ఫిర్యాదుచేసింది ముసలమ్మ.

"దానిమొగుడు కనక తీసుకెళ్లాడులే. మాట్లాడక ఊరుకో," అన్నాడు రాజు. ముసలమ్మ ఏడుస్తూవెళ్ళింది.





# అత్తా కోడళ్ళ కథలు

అనగా అనగా ఒకవూళ్ళో ఒక అత్తగారు, నలుగురు కోడళ్ళు వుండే వాళ్ళు. అత్తగారినిచూస్తే కోడళ్ళకు చాలాభయం. యిట్లావుండగా, పెద్ద కోడలికి చెరుకుగడ తిందామని వుండేది. చిన్న కోడలికి చలిమిడి తినాలని వుండేది. మూడవ కోడలికి అరిశెలు తినాలని వుండేది. నాలుగవ కోడలికి పరవాన్నము తినాలని వుండేది. చేసుకుందామంటె అత్తగారు కోప్పడుతుందని, అత్త లేనప్పుడు చేసుకుతిందామని సమయంకోసం చూస్తూవున్నారు.

ఒక రోజున అత్తగారు. పొలంవెళ్ళింది. అప్పుడు పెద్ద కోడలు, "అత్తయ్య పొలంవెళ్ళింది. మనకు కావలసినవి త్వరగా చేసుకుతిందాము" అంది. సరే అంటె సరే అనుకున్నారు,

ఎవరికి కావలసినవి వారు తెచ్చుకుని తినబోతూవుండగా అత్తగారు వచ్చింది. ఆవిడ చూస్తుందని యెవరు చేసుకున్నవి వారు దాచుకున్నారు. అత్తగారు చూచి చూడనట్లు వూరుకున్నది. కోడళ్ళు ఆగలేక "అత్తయ్యా! అప్పుడే వచ్చారేం?" అని అడిగారు.

అందుకు ఆమె ఇలాచెప్పింది: "నేను పొలంపోతుంటే చెరుకుగడ అంత పాము కనిపించింది. చలిమిడిముద్దంత రాయి విసిరాను. అరిశెంత పడిగ విప్పింది. పరవాన్నంలాగా నావళ్ళు పొంగిపోయింది." అని ఆయాసపడుతూ చెప్పింది కోడళ్ళు సిగ్గుపడి యెవరిభాగంలోది వాళ్ళు అత్తగారికికూడా పంచి పెట్టారు. అంతా ఆనందంతో తిన్నారు.

---

కాజా వెంకటకమలం, అడవులదీవి, గుంటూరుజిల్లా.

---

# పళ్లు — నాలుక



ఒకరోజున ఊరికేఉన్న నాలుకకి పెద్ద సందేహం వచ్చింది. నోరు అనే కొట్టులో, పండ్లు అనే భయంకరమైన భటులచే బంధింపబడి నట్లు తోచింది. ఆ బంట్లకు ఎపుడు తనమీద కోపంవస్తే అపుడు వారిక్రిందబడి నలిగిపోవల సిందేగదా! భయంవేసిన నాలుక పళ్లనిలా ప్రార్థించింది.

"దంతములారా! మీ ఐకమత్యము చాల గొప్పది. మీ ధాటికి తిరుగులేదు. ఎంత గట్టిదాన్నైనా ఇంతలో పిండి చేయగలరు. నేను మీకొక లెక్క కాదు. కనుక నన్ను దయఉంచి రక్షించండి. మీకెంతైనా పుణ్యం ఉంటుంది." అని బ్రతిమలాడింది.

ఎపుడూ వినని కొత్తమాటలు వినేసరికి పళ్లకు ఆశ్చర్యం వేసింది. నిజానికి నాలుక తమకంటె చాల గొప్పది. వయసులోనూ పెద్దదే. కాని ఇట్లా బ్రతిమలాడడానికి కారణం ఏమిటో తెలుసుకోలేక పళ్లు ఇలా జవాబు చెప్పినై.

"అయ్యో! నాలుకగారు! మీ రిలా పలకడం తగదు. మీరు అన్ని విషయములలోనూ మాకంటె గొప్పవారు. మీ సహాయము లేనిదే మా పని మేము చేయలేము, సరిగదా మా బ్రతుకులు మీ దయమీదనే ఆధారపడి ఉన్నవి.—మీరు ఎవరినైనా ఒకమాట తిట్టారా ఒక్క దెబ్బకు మేమంతా వ్రాలి క్రిందపడి పోవలసిందేగదా! కనుక మీరే మా యందు కరుణచూచి కాపాడండి" అన్నవి.



దాంతో తనశక్తి ఇంతా అని ఆశ్చర్య పడుచున్న నాలుక ఆనందముపట్టలేక రెండు పెద్దసైజు పంచదార లడ్డూలకు ఆర్డరిచ్చింది.

రా. కృష్ణమూర్తి, కైకలూరు.




అనగా అనగా ఓవూళ్లో ఒక వస్తాదు వుండేవాడు. యింకో వూళ్లో ఇంకో వస్తాదు వుండేవాడు. వారిద్దరూ ఓ గ్రామములో కలుసుకున్నారు. వక వస్తాదు రెండోవస్తాదుతో అన్నాడు కదా "నీవు నాతో కుస్తికి వచ్చెదవా లేక నీ కాలితోడా తీసెదవా?" అని.



రెండో వాడు యేమన్నాడంటె "నేను తొందర పనిమీద వెళ్తూన్నాను; ఇప్పుడు వీలుకాదు. ఫలానారోజున కలుసుకుందామంటె నేను వస్తాను" అన్నాడు. సరేనని వకరి గ్రామము వకరు తెలుసుకుని వెళ్లిపోయినారు.

కొంతకాలమువకు వాళ్లు అనుకున్న ప్రకారము గడువురోజు వచ్చినది. వకవస్తాదు యింటివద్ద భార్యతో "ఏమే, నాకోసరము వక వస్తాదు వస్తాడు. వాడితో యేమని చెప్పతావంటే 'ఫలానా గ్రామములో విపరీతమయిన వర్షము కురుస్తున్నదట. వర్షము పడకుండా అక్కడ గండుచీమల మీసములతో పందిరివేయుటకు వెళ్లినాడు' అని చెప్ప"మని బయలుదేరినాడు.

రెండవవస్తాదు యింటివద్ద భార్యతో అన్నాడుగదా "ఏమే, నాకోసము వక వస్తాదు వస్తాడు. 'ఫలానా గ్రామములో మబ్బు చిల్లిపడి ఏనుగ తొండమంత వర్షధారపడుతూ ఉన్నదట. వర్షధార పడకుండా ఎర్రచీమల చర్మముతో మాటుపెట్టుటకు వెళ్లినా' డనిచెప్ప"మని బయలుదేరినాడు.

డి. నరసింహారావు, కొల్లూరు.



ఈవిధంగా భార్యలతోచెప్పి బయలు దేరిన వారిద్దరు పొరపాటున దారిలో కలుసుకున్నారు. ఇక్కడనే కుస్తీపట్టెదమంటె రెండవాడు "యిక్కడ మన పోట్లాట చూచేవారు ఎవరూలేరు. గెలుపు ఎవరిదయినది చెప్పేవారు లేరు. ఆ కనపడే గ్రామము వెళ్లెద"మంటుండగా ఆ దోవనే ఓ ముసలమ్మ పొలములో ఉన్న మనమడికి యేడుకుండలలో అన్నము వగయిరాలు పెట్టుకుని యేడు కుండలు దొంతరగా నెత్తిన పెట్టుకుని వెళుతూఉన్నది. వస్తాదులు ఆ ముసలమ్మను పిలచి "అవ్వా మేమిద్దరము పోట్లాడుకుంటాము. ఎవరు గెలిచినది, ఎవరు వోడినది చెప్ప"మన్నారు. ఆ ముసలమ్మ యేమన్నదంటే "మీ పోట్లాట చూస్తూవుంటే పొలములో ఏనుగులను కాస్తూన్న నా మనమడు నా కోసరము యెదురుచూస్తూ ఉంటాడు. వాడికి అన్నము పట్టుకెళుతూ వున్నాను. మీరు నా నెత్తినవున్న యేడుకుండల దొంతర పడకుండా చెరొకరు రెండుభుజముల మీద ఎక్కి పోట్లాడుతూఉండండి. నేను నడుస్తూనే వుంటాను. దొంతర ఎవరు పడనీయకుండా వుంటారో వారు గెలిచినట్ట"ని చెప్పింది. ఆ ప్రకారమే వారు చెరియొక భుజము మీదయెక్కి పోట్లాడుతూ వున్నారు. ముసలమ్మ నడుస్తూనేవున్నది. పొలం సమీపమునకు వచ్చింది. ముసలమ్మ మనమడు, యేనుగులను పొలములో కాయుచున్నాడు.

వాడు తన అవ్వరావటము చూపి తొందరగా యేడుయేనుగులనూ మూటకట్టి చెట్టు కొమ్మకు వేలాడదీశాడు. ఇది కని





పెట్టి వస్తాదులు తమని చంపటానికి వస్తున్నాడని భయపడి ముసలమ్మ భుజముల మీదినుంచి కిందికిదూకి పారి పోయినారు.

ముసలమ్మ చెట్టువద్దకు వెళ్ళగా చెట్టుకుకట్టిన యేనుగులమూట కొమ్మకు బరువయి కొమ్మ విరుగుటకు సిద్ధ మవగా ముసలమ్మ తలవెంట్రుక ఒకటి తీసి చెట్టుకొమ్మకు పోటీవుంచింది.

ఆకాశ మార్గాన పోతూవున్న గరుడ పక్షి యేనుగుల మూటనుచూసి ఆహారం దొరికిందని సంతోషించి మూటను ఆత్రంగా తన్నుకుపోయింది. కొంత దూరం పోగాపోగా బరువుజాస్తిఅయి ఆమూటజారి కిందపడసాగింది.

ఒక రాజకుమార్తె తలంటి పోసు కుని మేడమీద తలపైకెత్తి జుట్టు ఆర బెట్టుకొంటూ వుండగా యేనుగులమూట ఆమె కంటోపడింది. కంటో పడిన నలక ఎంతకూ రాకపోవటంవల్ల మంగ లిని పిలిపించారు.

మంగలి రాజకుమార్తె కంటో పడిన ఏనుగుల మూటతీసి దానిని తనపొదిలో వేసుకుని యింటికి వెళ్లాడు. ఏడు ఏనుగులనూ మూటవిప్పి తన ఇంటిముందు ఏడు స్తంభాలకు కట్టి వేశాడు.

మంగలికూతురు వాటినిచూసి ఆడు కోవటానికి తన కివ్వమని తండ్రిని అడిగింది. "వాటిని నువు నలిపి చంపే స్తావు. అందుచేత నీకివ్వను," అన్నాడు మంగలి.

అందుకు మంగలి కూతురు వసా రాలో కూర్చుని పెద్దపెట్టున ఏడవ సాగింది ఆమె కంటివెంట కన్నీరు తర దలై పారింది. ఆ ప్రవాహంలోపడి ఏడు ఏనుగులూ కొట్టుకుపోయాయి.

మీరు చెప్పండి : ఇంతమందిలోనూ ఎవరుగొప్ప? ముసలమ్మా? మనమడా? రాజుకూతురా? మంగలాడా? మంగ లాడికూతురా?



# పోలిసెట్టి

అనగా అనగా ఓవూరు. ఆ వూళ్లో పోలిసెట్టి అని ఓ కోమటి ఉండేవాడు. పోలిసెట్టి ఎంతో సంపాదించాడు, ఖర్చు చేశాడు. అయినా పోలిసెట్టిదగ్గిర చాలా డబ్బుంది. కాని ఆసంగతి ఎవరికీ తెలీదు.

పోలిసెట్టి ఇల్లు పూరి గుడిసె. ఓ నాడు గాలివానవచ్చి గుడిసెకప్పు కాస్తా ఎగిరి పోయింది. గోడ కాస్తా పడి పోయింది. కూలి వాళ్ళను పెట్టి పోలిసెట్టి మట్టితో మళ్ళా గోడపెట్టించాడు.

సెట్టిదగ్గిర చాలా డబ్బు వున్నదని దొంగలు పసిపట్టారు. కొత్త గోడ ఉసులుచూసుకుని అర్థరాత్రివేళ గోడకి కన్నం వేశారు. ఒకదొంగ కన్నంలో నుంచి లోపల జొరబడుతూండగా, కొత్తగోడకదూ, కూలిపడింది. కన్నంలో దొంగ కిచుక్కుమని చచ్చాడు. మిగిలిన దొంగలు పిక్కబలం చూపించారు.



వెర్రి వెంగళ్రాజు ఆవూరికి రాజు. ఆరాజుదగ్గిర దొంగలు ఫిర్యాదు చేశారు, 'పోలిసెట్టి దొంగను చంపా' డని. వెర్రి వెంగ



రాజుగారు కూలివాణ్ణి పిలిపించి, "ఒరే, మట్టిలో నీళ్ళ జాస్తిగా ఎందుకు పోశావు?" అని అడిగాడు.

"మహాప్రభో, నా తప్పేమీ లేదు. కుమ్మరాడు కడవమూతి పెద్దదిచేశాడు" అన్నాడు కూలివాడు.

రాజుగారు కుమ్మరాణ్ణి పిలిపించి, "కుమ్మరాడా, కుమ్మరాడా, కడవమూతి పెద్దది ఎందుకుచేశావు?" అన్నాడు.

"మహాప్రభో, నా తప్పేమీ లేదు. నేను కడవచేసేసమయానికి నాట్యకత్తె



[రా]జుగారు పోలిసెట్టిని పిలిపించి, "దొంగను ఎందుకు చంపావు?" అని అడిగాడు.

"మహాప్రభో, ఇందులో నాతప్పేమీ లేదు. పుచ్చుకునేడబ్బులు పుచ్చుకుని గోడకట్టిన మేస్త్రి అట్లా అఘోరించాడు. చూడండి న్యాయం" అన్నాడు సెట్టి.

రాజు తాపీమేస్త్రీనిపిలిపించి, "సెట్టిగారిగోడ అంత అసనాటుగా ఎందుకు కట్టావు?" అని అడిగాడు.

"మహాప్రభో, ఇందులో నాతప్పేమీ లేదు. కూలివాడు మట్టిలో నీళ్లజాస్తిగా కలిపాడు", అన్నాడు తాపీమేస్త్రీ.

ఆపక్కగా వెళ్లింది" అన్నాడు కుమ్మరాడు.

రాజుగారు నాట్యకత్తెను పిలిపించి, "నాట్యకత్తే, నాట్యకత్తే, కుమ్మరాడింటిమీదుగా ఎందుకు వెళ్ళావు?" అన్నాడు.

"మహాప్రభో, నా తప్పేమీ లేదు. కమసాలి నా నగ ఇవ్వటం ఆలస్యం చేస్తే అందుకు వెళ్లవలసి వచ్చింది" అన్నది నాట్యకత్తె.

రాజు కమసాల్ని పిలిచి, "కమసాలీ, కమసాలీ, నాట్యగత్తె నగ ఎందుకు





త్వరగా ఇవ్వలేదు?" అన్నాడు.

"మహాప్రభో, నా తప్పేమీ, లేదు. కోమటి నాకు బంగారం ఇవ్వలేదు," అన్నాడు కమసాలి.

రాజు కోమటిని పిలిపించి, "కోమటీ, కోమటీ, కమసాలికి బంగారం ఎందుకివ్వలేదు?" అన్నాడు.

కోమటికి ఏమిచెప్పటానికి పాలుబోక "తె- త్తె- త్తే" అన్నాడు.

కోమటే దొంగచావుకు కారణమని ఊహించి కోమటిని ఉరితీయ ఆజ్ఞ యిచ్చాడు వెర్రి వెంగళ్రాజు.



ఇంకేం. కోమటిని ఉరి తీసేచోటికి తీసుకుపోయినారు. కోమటిని ఉరితీస్తు న్నారనితెలిసి జనం చూడటానికి తం డోపతండాలుగా వచ్చారు. రాజుగారు కూడా సపరివారంగా వినోదం చూడ వచ్చాడు.

తీరా కోమటిమెడకు ఉచ్చు తగి లించబోయేసమయానికి జనంలోనుంచి ఒక కుర్రవాడు ముందుకొచ్చి, "ఆగండి ఆగండి. ఆ కోమటిని ఉరితీయొద్దు. వాడికిబదులు నన్ను ఉరితీయండి" అని అరిచాడు.

వెర్రివెంగళ్రాజుగారు ఆకుర్రవాణ్ణి పిలిచి, "నీకేం పొయ్యేకాలం? కోమటికి బదులు నువ్వెందుకు చస్తా నంటావు?" అని అడిగాడు.

అంటే ఆకుర్రాడు చెప్పాడు కదా, "మహాప్రభో, ఈముహూర్తంలో చచ్చి పోయినవాడు ముందుజన్మలో ఈరాజ్యా నికి రాజవుతాడు. ఈ రాజ్యానికి రాజు కావాలనే ఆశతో నేను ఉరితీయించు కుంటానంటున్నాను. అందుచేత దయ వుంచి కోమటిబదులు నన్నే ఉరితీయిం చండి" అన్నాడు.

అనేటప్పటికి వెర్రి వెంగళ్రాజు గారికి చెడ్డకోపం వచ్చేసింది.

"ఆరి తప్పుడు ముండాకొడకా! చక్కగా ఉరితీయించుకుని వచ్చేజన్మలో నారాజ్యం కాజేతా మనుకుంటున్నావా? నేను ఒప్పుతాననేనా నీ ఉద్దేశం? ఈ ఉరి ఇంకెవరూ పడటానికి వీల్లేదు. మేమేపడాలి! మళ్ళీ వచ్చేజన్మలో ఈ రాజ్యాన్ని మేమే ఏలాలి. అందుచేత మమ్మల్ని తక్షణం ఉరితీసివెయ్యండి" అని రాజుగారు భటులకు ఆజ్ఞాపించారు.

రాజాజ్ఞ దాటరానిదికదా? అందుచేత రాజభటులు ఉరి స్తంభంనుంచి కోమటిని దింపేసి వెర్రివెంగళ్రాజుగారిని నిక్షే పంగా ఉరి తీసేశారు. ఉపాయంగా కోమటి మరణదండన తప్పించిన కుర్ర వాడు ఆ రాజ్యానికి రాజయినాడు.






ఇంట్లో దీపావళి

—చిత్రకారుడు : వెంకటాచారి



అడవిలో దీపావళి

—చిత్రకారుడు: వెంకటాచారి




వీధిలో దీపావళి

—చిత్రకారుడు: చిత్రా



# బ్రహ్మరాక్షసుడు



పూర్వం ఒక భాగ్యవంతుడు ఉండే వాడు. అతనికి కొన్నివేల యెకరాల పొలం ఉండేది. అయితే అతడు వట్టి పిసినిగొట్టు. పిల్లికికూడా బిచ్చం వేసే వాడు కాడు. అలాంటివాడికింద ఎవడు పనిచేస్తాడు? ఎవరన్నా కొత్తవాళ్లువచ్చి నా పదిరోజులుండి పారిపోయేవాళ్లు. అలాంటప్పుడు వ్యవసాయం ఎలా సాగుతుంది? పొలం ఎలా పండుతుంది? అన్నివేల ఎకరాలూ బీళ్లు కాసాగాయి. అయినా కూలీలను సరిగా చూచిన పాపానపోలేదు. కాని పొలాలు పాడై పోతున్నందుకు మాత్రం విచారపడు తుండేవాడు.

ఒకరోజున ఆభాగ్యవంతుడిఇంటికి ఒక సన్యాసి వచ్చాడు. ఆ సన్యాసికి అతడు తనగోడుఅంతా చెప్పుకొన్నాడు. అదంతావిని సన్యాసి జాలిపడి ఒక మంత్రం ఉపదేశించాడు. భాగ్యవంతుడు సన్యాసిచెప్పినట్లుగా ఆ మంత్రం నూట యెనిమిదిసార్లు జపించగానే ఓ బ్రహ్మ రాక్షసుడుప్రత్యక్షమై "నీకు ఏమికావా" లని అడిగాడు. "నాకు పని చేసిపెట్టా లి." అని భాగ్యవంతుడన్నాడు. "సరే చేస్తాను" అన్నాడు బ్రహ్మరాక్షసుడు. "నేను దమ్మిడీకూడ యిచ్చుకోలేను" అన్నాడు పిసినిగొట్టు. "పరవాలేదు" అన్నాడు బ్రహ్మరాక్షసుడు.

తేరగా పనిచేసిపెట్టేవాడు దొరికి నందుకు భాగ్యవంతుడు సంతోషించి "నా పొలమంతా దున్నిర"మ్మని బ్రహ్మ రాక్షసునికి చెప్పాడు. ఈపని చెప్పి అతడు భోజనంచేదామని కాళ్లు కడు క్కోటానికి వెళ్లాడు. కాళ్లు కడుక్కో టానికి అతడు చెంబు తీసుకొనేలోపల

బ్రహ్మరాక్షసుడువచ్చి "పొలం దున్ని వేశాను" అన్నాడు.

"అంతా దున్నావా?"అన్నాడు భాగ్యవంతుడు.

"అంతాను" అన్నాడు రాక్షసుడు.

"ఆకాస్త దున్నటానికి ఇంతసేపు పట్టిందా?''అని అతడు దబాయించాడు. బ్రహ్మరాక్షసుడు "ఏదో చేశాను. తరువాత ఏమిచెయ్యను?"అన్నాడు. "పొలానికంతకూ నీళ్లుపెట్టి దమ్ముచేసి తొందరగా రావాలి?" అన్నాడు అతను మేకపోతు గాంభీర్యంతో.

బ్రహ్మరాక్షసుడు వెళ్లి భాగ్యవంతుడు పీటమీద కూర్చునేటప్పటికల్లా వచ్చి, "నీళ్ళు పెట్టి దమ్ము చేసి వచ్చాను. ఇంకేమిచెయ్యాలి?" అన్నాడు.

"అయ్యో ఒక్కసారే దమ్ము చేశావా! గరపనేల ఒకటికి మూడు సార్లు దమ్ము చేస్తేకాని కాదే"అన్నాడు.

బ్రహ్మరాక్షసుడు మళ్ళీవెళ్లి అతడు మజ్జిగ పోసుకునేవేళకువచ్చి "అయిపోయింది, ఇంకా ఏమిచేయాలి?" అన్నాడు.

భాగ్యవంతుడు లోలోన బిత్తరపోయాడు. కాసేపు పరకాయించి "పొలమంతా నాటు వేయాలి. పాలుమారి పండుకొనేవు. నేనువచ్చి చూస్తాగా" అన్నాడు.

బ్రహ్మరాక్షసుడువెళ్ళి అతడు అన్నంతిని చేతులు కడుక్కొనేవేళకు వచ్చి, "నాటయిపోయింది, ఇంకా ఏమి చెయ్యాలి?" అన్నాడు. "నిజంగా నాటేసివచ్చావా?" అనిఅడిగి పోయి చూచాడు. పొలమంతటా మొక్కపడ్డది. దానితో ఆసామికి గుండెదడ ప్రారంభ



మైంది. పని ఎలా చూపించాలో అర్థం కాలా. కాస్త తలగోక్కొని "ఎరువు కూడా చల్లిరా, తొందరగా రావాలి" అన్నాడు. బ్రహ్మరాక్షసుడు వెళ్లాడు.

ఆసామి ఎకాయెకిని వంటయింట్లో ఉన్న భార్యదగ్గరకు వెళ్ళి. "ఉన్న పనంతా గంటలో బ్రహ్మరాక్షసి చేసి వేశాడు. వాడికి ఇంకా ఏమిపని చూపిం చేది. చూపించకపోతే నన్ను మింగేస్తా డు," అని చెప్పాడు.

భార్య, "దిగులెందుకు. వాణ్ణి ఒక సారి యిక్కడకు పంపించండి," అంది.

మరో అయిదు నిమిషాలకు బ్రహ్మ రాక్షసుడువచ్చి అతనికి ఎదురుగా నిల బడ్డాడు. ఆసామి అతన్ని భార్యదగ్గ రకు పంపించాడు. ఇంట్లో పనులన్నీ చేయించుకొన్న తరువాత భార్య తలలో నుంచి మెలికలుతిరిగిఉన్న వెంట్రుకను లాగి "దీన్ని వంకరతీసి సాపుచేసి తీసుకురా" మ్మని చెప్పింది.

ఆ వెంట్రుక పట్టుకొని బ్రహ్మ రాక్షసుడు దొడ్లోకివెళ్లి సరిచేయటానికి ప్రయత్నించాడు. రోజులు గడిచాయి, వారాలు గడిచాయి, మాసాలు గడిచాయి ప్రయత్నిస్తూనే వున్నాడు. ఈ వెంట్రుక వంకరపోలేదు. బ్రహ్మరాక్షసుడికి విసు గెత్తింది. కాసేపు ఊళ్లో తిరిగాడు. అలా తిరుగుతూ తిరుగుతూ కంసాలి వంకరతీగను కుంపట్లో కాల్చి వంక తీస్తూఉంటే చూచాడు. అతడు ఎగిరి గంతువేసి అలాగే చేదామని వెంట్రు కను నిప్పులోవేశాడు. అది కాలిపో యింది. వెంటనే బ్రహ్మరాక్షసుడుకూడా మాయమైపోయాడు.



# అంతా బ్రహ్మమే!

వెనకటికి ఒక గురువుగారిదగ్గిర ఒక శిష్యు డుండేవాడు. వాడు గురువుగారు చెప్పిన ప్రతిముక్కా మూఢంగా నమ్మేవాడు.

ఒక నాడు గురువుగారు శిష్యుడితో "ప్రపంచంలో బ్రహ్మపదార్థంకాని దేదీ లేదనిచెప్పాడు. నీలోనూ, నాలోనూ, ప్రతి రాయిలోనూ, రప్పలోనూ, పుట్టలోనూ చెట్టులోనూ, పురుగులోనూ పుట్రలోనూ ఉన్నది అంతా బ్రహ్మమే" అన్నాడు.

ఈ మాట శిష్యుడి బుర్రలో బాగా నాటిపోయింది.

ఒకనాడు శిష్యుడు వీధివెంట నడుస్తున్నాడు. ఎదురుగా రాజుగారి ఏనుగ వస్తున్నది. మావటివాడు వీధిలో నడిచే వారిని, "తొలగండి, తొలగండి, ఏనుగకు పిచ్చెక్కింది," అని హెచ్చరిస్తున్నాడు.

మావటివాడిమాటలు లక్ష్యం చెయ్యకుండా మన శిష్యుడు ఏనుగకు ఎదురు వెళ్లాడు. "నాలో ఉన్నదీ బ్రహ్మమే, ఏనుగులో ఉన్నదీ బ్రహ్మమే. అలాంటప్పుడు బ్రహ్మపదార్థం బ్రహ్మ పదార్థాన్ని ఏం చెయ్యగలుగుతుంది?" అనుకున్నాడు వాడు.

తీరా దగ్గిరికివచ్చాక ఏనుగ శిష్యుణ్ణి తొండంతో ఎత్తి పక్కకు విసిరి పారేసింది. శిష్యుడి కా దెబ్బతో నడ్డివిరిగింది. గురువుగారు తనను మోసం చేశాడనుకున్నాడు. తిన్నగా గురువుగారి దగ్గిరికివెళ్లి జరిగినదంతాచెప్పి, "అయ్యా, మీరు అన్నిటిలోనూ బ్రహ్మమే ఉన్నదంటిరే? నన్ను ఏనుగ ఎందుకింతపని చేసిందీ?" అని అడిగాడు.

దానికి గురువుగారు, "ఓరి, పిచ్చవెధవా! ఏనుగలోఉన్నది బ్రహ్మమే అయితే మావటివాడిలో ఉన్నది బ్రహ్మం కాదా? వాడిమాట ఎందుకు వినలేకపోయావు?" అని మందలించారు.

శిష్యు డామాటకు సిగ్గుపడి, ఇకముందెన్నడూ గుడ్డిగా ఇతరులుచెప్పే సత్యాలను పాటించరాదనీ, తన తెలివితేటలు కూడా ఉపయోగించుకోవాలనీ తెలుసుకున్నాడు.



ఋ. మ. నరసయ్య, బళ్లారి.

# గురువు - శిష్యుడు

అనగా అనగా ఒక ఊళ్లో ఒక నిరుపేద బ్రాహ్మ డుండేవాడు. ఆబ్రాహ్మడికి ఇద్దరు కొడుకులు. పేదబ్రాహ్మడు తనకొడుకుల నిద్దర్నీ ఒక గురువుగారి దగ్గిరికి తీసుకు పోయి, "అయ్యా, వీళ్ళకు చదువు చెప్పండి" అన్నాడు.

"చదువు చెబుతానుగాని నాకు దక్షిణ ఏమిస్తావు?" అని అడిగాడుగురువుగారు.

"నాబిడ్డలలో ఒకణ్ణి మీకిచ్చేస్తాను." అన్నాడు బ్రాహ్మడు.

సరేనని గురువుగారు అన్నదమ్ములిద్దరికీ చదువుచెప్ప నారంభించాడు. అయితే పెద్దవాడు మొద్దు. వాడికి చదువు సంధ్యలు ఏమీ రాలేదు. అందుచేత తనకు తెలిసిన గజకర్ణ, గోకర్ణ, వాయు స్తంభన, జల స్తంభన, అగ్ని స్తంభన విద్య లన్నీ రెండోవాడికి పూర్తిగా చెప్పేశాడు.

చదువు పూర్తి అయిపోయింది. "మీరు వచ్చి మీ యిష్టంవచ్చినపిల్లవాణ్ణి పట్టుకు పోవచ్చు." అని గురువుగారు బ్రాహ్మడికి కబురుచేశాడు.

అయితే చిన్నవాణ్ణి తనవద్దనే ఉంచుకుందామని గురువుగారికి ఆశపుట్టింది. అందుచేత చదువుసంధ్యలులేని పెద్దవాడికి చక్కగా తలంటి పోయించి మంచి బట్టలుకట్టి ఇంటి అరుగుమీద కూర్చోబెట్టి, రెండోవాణ్ణి అడివికిపోయికట్టెలు కొట్టుకు రమ్మని పంపించాడు.





గురువుగారి దొంగఎత్తు గ్రహించి, అడి వికిపోయిన రెండోవాడు పక్షిరూపంధరించి శీఘ్రంగా తండ్రిదగ్గిరికి వెళ్ళి, "నాన్నా, మా గురువుగారితో, నాకు రెండోవాడే కావాలి, అని చెప్పు" అని చెప్పాడు.

తండ్రి గురువుగారిదగ్గిరికి వచ్చాడు.

"ఆహా, ఎంత అదృష్టవంతుడివి! ఇంత మందికి చదువుచెప్పాను గాని, నీ పెద్ద కొడుకు చదివినట్టు నాదగ్గిర ఎవరూ చదువుకోలేదు. రెండోవాడా ? వాడికి ఎవరూ చదువు చెప్పలేరు. ఆమాట నేను రాసిస్తాను" అన్నాడు గురువుగారు బ్రాహ్మడితో.

ఆమాటవిని బ్రాహ్మడు వినయంగా, "అంతకష్టపడి మా పెద్దవాణ్ణి మీరు పెద్ద చేశారు. వాడికి మీరు నేర్పినవిద్యలు మీబోటివాళ్లు గ్రహించవలసిందేగాని నాబోటి నిర్భాగ్యుడికి ఏమి తెలుస్తాయి! అందుచేత పెద్దవాణ్ణి మీరే ఉంచుకుని రెండో వెధవను నా కిప్పించండి" అన్నాడు.

గురువుగారిఎత్తు పారలేదు. బ్రాహ్మడు రెండోవాణ్ణి పట్టుకుని వెళ్లిపోయినాడు.

ఇదంతా రెండోవాడుచేసిన మోసమేనని గురువుగారికి తెలిసిపోయింది. శిష్యుడిమీద పగ తీర్చుకోవాలని ఆయన వేచిఉన్నాడు.

ఈలోపల ఇక్కడ బ్రాహ్మడి రెండో కొడుకు తండ్రితో, "నాన్నా, మనకు డబ్బు కావాలి. కనక నేను మంచి యవనాశ్వాన్నవుతాను. నన్ను తీసుకుపోయి రాజు





గారికి అమ్మేయ్యి. ఆతరవాతవిషయం నేనాలోచిస్తాను" అని గుర్రంగామారాడు.

గుర్రంగా మారిన తనకొడుకును ఆ బ్రాహ్మడు రాజుగారికి నూరువరహాలకు అమ్మి ఆడబ్బుతో ఇంటికి తిరిగివచ్చేశాడు.

తనశిష్యుడు గుర్రంరూపంధరించి రాజుగారి అశ్వశాలలో ఉన్నట్టుగ్రహించి, గురువుగారు రాజుదగ్గిరికివెళ్ళి, "రాజా, నేను దూరప్రయాణంమీద వెళుతున్నాను. నీ దగ్గిరఉన్న గుర్రాలలో మంచి యువనాశ్వాన్ని నాకు ఇప్పించు" అన్నాడు.

రాజుగారు గురువుగారికి ఆకిందటిరోజు ననే కొన్న గుర్రాన్ని ఇప్పించారు. గురువుగారు దానిమీదఎక్కి సవారీ ఆరంభించాడు.





కొంతదూరం పోయినాక గుర్రం ఒక నదిదగ్గిరికివచ్చి ఒక్కసారిగా నదిమధ్యకు దూకి చేపగా మారిపోయింది. ఇదిచూసి గురువుగారు కొంగరూపంధరించి చేపను వేటాడ నారంభించాడు. అప్పుడు శిష్యుడు చిలకరూపంధరించి అతివేగంగా నేరుగా రాజకుమార్తె అంతఃపురంలోకి ఎగిరిపోయినాడు. గురువుగారు డేగరూపం ధరించి వెంబడించాడు.

శిష్యుడు రాజకుమార్తెతో మనిషిగొంతుతో, "నన్నెవ్వరికీ ఇవ్వకు. నా గొంతు నులిపి పారేసినా నాకిష్టమే" అనిచెప్పాడు. ఇంతలో డేగరూపంలో వచ్చిన గురువుగారు తన మామూలు రూపం ధరించి రాజ



కుమార్తె దగ్గరఉన్న చిలకను తన కిచ్చి వేయమని రాజును కోరాడు.

రాజకుమార్తె ఒప్పుకోలేదు. కాని తండ్రి నిర్బంధించాడు. అందుచేత రాజకుమార్తె కోపంవచ్చినట్టునటించి తన చేతిలోఉన్న చిలకను గొంతునులిపి విసిరి కిందకొట్టింది. వెంటనే ఆచిలక వందలకొద్ది పురుగులుగా మారి నేలమీద పాకసాగాయి.

ఇదిచూసి గురువుగారు కోడిరూపం ధరించి పురుగులను ఏరుకు తినబోయాడు.

ఇంతలో ఒకపురుగు చప్పున పిల్లిగామారి కోడిమెడ నోటపట్టింది.

"బాబో, రక్షించు. బుద్ధి తక్కువై, పొరపాటున నీజోలికి వచ్చాను" అని గురువుగారు తన శిష్యుడితో మొరపెట్టుకున్నాడు. శిష్యుడు గురువుగారిమెడవదిలి యథారూపం ధరించాడు.

ఇదంతాచూసిన రాజు శిష్యుడి అద్భుత శక్తికి మెచ్చుకుని తన కుమార్తెనిచ్చి పెళ్లిచేశాడు.





# పెర్రి వాళ్లు

అనగా అనగా ఒకగ్రామంలో ఒక సంసారి ఉండేవాడు. ఆయనకు గోపాలుడనే కుమారుడుండేవాడు. గోపాలుడు బుద్ధిమంతుడు. లేనిపోని వాటినిగురించి విచారించేవాడుకాడు. కష్టాలు కలిగితే వాటినుంచి ఉపాయంగా బయటపడేవాడు. అంతేగాని వాటిని తలుచుకుని కుంగిపోయేవాడుకాడు.

ఆగ్రామంలోనే మరో సంసారికి ఒక కూతురున్నది. ఆమెపేరు జానకి. జానకిని గోపాలుడు తరుచు చూస్తుండేవాడు. ఆమెఅంటే గోపాలుడి కిష్టం ఉండేది. అటువంటి సందర్భంలో గోపాలుడి తండ్రి తనకొడుక్కు జానకిని చేసుకుందా మనుకున్నాడు. ఈ ఆలోచన రెండుపక్షాలవారికీ నచ్చింది. పెళ్లిచూపులకూ తాంబూలాలకూ మంచి రోజు ఏర్పాటయింది.

ఆనాడు పెళ్ళికొడుకు తరఫువారంతా పెళ్ళికూతురి తండ్రి ఇంటికి వచ్చారు. చాపలువేసి పెళ్ళివారిని వసారాలో కూర్చోబెట్టి పెళ్ళికూతురు తండ్రి జానకితో, "అమ్మా, నువ్వెంత పనిమంతురాలివో పెళ్ళివారు చూస్తారు. నువ్వు వెంటనే గొడ్లసావిడికి వెళ్ళి పెద్ద చెంబులో పాలుపితుక్కునివచ్చి, వాటిని కాచి వారందరికీ ఇయ్యి." అని పని చెప్పాడు.

జానకి పెద్దచెంబు పట్టుకుని గొడ్లను పాలుపితికింది. పాలు తెచ్చి వంటింటో పొయిమీదపెట్టి పొయిలో మంటఎగదోస్తూ కూర్చున్నది. ఇంతలో జానకి కళ్లు పైనఉన్న అటకమీద పడ్డాయి. ఆ అటకమీద పాతరోకలిబండ ఒకటి కొద్దిగా బయటికి పొడుచుకువచ్చి ఉన్నది. ఆ రోకలిబండ చూస్తూఉంటే జానకి ఆలోచన పరిపరి విధాల పోయింది. రేపు తన పెళ్ళిఅవుతుంది. కొంతకాలానికి పిల్లాడు పుడతాడు. పసివెధవ తనను విడిచిఉండడు. ఇంటో పనిఎట్లా? అందుచేతవాణ్ణి చంకనేసుకుని పనిచెయ్యాలి. వాణ్ణి చంకనేసుకుని తను ఇట్లాగే పాలు కాస్తూఉంటుంది. ఇంతలో అటకమీదినుంచి రోకలిబండ కాస్తా వాడి నెత్తిమీద పడుతుంది. పాపం, వాడి ప్రాణాని కెంతకావాలి?



ఆలోచన ఇక్కడికి వచ్చేసరికి జానకికి పట్టరాని దుఃఖంవచ్చి, చెంగు ముఖానికి అడ్డంపెట్టుకుని భోరుమని ఏడవ సాగింది.

కుమార్తె ఎంతకూ రాకపోవటం చూసి జానకితల్లి వంటింటోకి అడుగు పెట్టింది. అడుగు పెడుతూనే కూతురి దుఃఖంచూసి, "ఏమిటే, తల్లీ?" అని అడిగింది.

"పసివెధవమీద ఆ రోకలిబండ పడిందే. నా కన్నతండ్రికీ నాకూ రుణం తీరిందే!" అని జానకి పెద్దపెట్టున ఏడ్చింది.

"అయ్యొ, నాయనా! నీకెంతగతి పట్టిందిరా! కళ్ల చూసుకోకుండానే పొయ్యావురా! ఈ పాపిష్టి రోకలి బండ ఎక్కడ దాపరించిందిరా నీ ప్రాణానికి?" అంటూ జానకితల్లి కూడా ఏడుపు లంకించుకుంది.

మరికాస్సేపటికి ఇంట్లో ఆడవాళ్లూ, పిల్లలూఅంతా వంటింటోచేరి జానకికి పుట్టే పిల్లవాడు చచ్చినందుకు భోరున ఏడుపులూ పెడబొబ్బలూ సాగించారు. ఈలోపుగా పొయ్యిమీదిపాలు పొర్ల నారంభించాయి.

"పిల్ల ఇంతసేపాయె రాదేమబ్బా?" అనుకుని జానకి తండ్రివచ్చి చూచును గదా వంటింటో తనవారంతా దుఃఖ సముద్రంలో మునిగిఉన్నారు. "ఏమిటర్రా? ఏం కొంప మునిగిందర్రా?" అన్నాడా పెద్దమనిషి ఆదుర్దాగా.

"అయ్యో, మీకింకా తెలీదుటండీ? ఆ పాపిష్టి రోకలిబండ కాస్తా చంటివాడిమీద పడిందండీ!" అని భార్య శోకాలుతీసింది.

"ఏ చంటివాడే?" అన్నాడాయన ఏడుపు నిగ్రహించుకుంటూ.

"మన జానకికొడుకు!" అంటూ ఇంటావిడ ఇంకా గట్టిగా ఏడిచింది. దాంతో ఇంటాయనకి మతిపోయి ఆయనకూడా గుడ్లనీళ్ల కుక్కుకో సాగాడు.

పెళ్ళికూతురు వాళ్లెవరూ అయిపు లేక పోవటంచూసి గోపాలుడు లోపలికి





వచ్చాడు. ఒక్క క్షణంలో అతనికంతా అర్థమయింది. పొయిమీదినుంచి పాలు దించి, అటకమీది రోకలిబండ వెనక్కు తోసేసి, "జానకిని పెళ్ళాడటం నా కిష్టమేగాని, ప్రపంచంలోకల్లా వెర్రి ముండని పెళ్ళాడటం నాకిష్టంలేదు. దీని కన్న వెర్రివాళ్ళింకా ముగ్గురైనా ఉన్నారని నాకు నమ్మకం కలిగితేగాని నేను దీన్ని పెళ్ళాడను," అనిచెప్పి గోపాలుడు వెర్రివాళ్లనువెతుక్కుంటూబయలుదేరాడు.

పోయి, పోయి, గోపాలుడొక గ్రామం చేరుకున్నాడు. ఆగ్రామంలో ఒక ఆడమనిషి ఇంటికి నిచ్చెనవేసి దానిమీదికి ఆవు నెక్కించటానికి ప్రయత్నిస్తున్నది.

"యేం చేస్తున్నావు. అవ్వా?" అని అడిగాడు గోపాలుడు.

"అయ్యో, నాయనా! ఇది నా ఆవు. వెళ్ళి వాళ్ళ దొడ్లోనూ వీళ్ల దొడ్లోనూ పడుతుందిగాని, సొంతఇంటి కప్పుమీద కావలిసినంత గరిక మొలిస్తే అది మెయ్యదు," అన్నది ఆమనిషి

"ఆవును ఇంటి కప్పెక్కించకపోతే, నువేఎక్కి ఆగరికకోసి దానిముందు వెయ్యరాదూ?" అన్నాడు గోపాలుడు.

"అయ్యో, నాయనా! నాలుగుకాళ్లది ఆదే నిచ్చెన ఎక్కలేకపోతే మూడు కాళ్ల ముసల్ని నేనెక్కగలనా?" అన్నది అవ్వ.

"ఆవు కప్పుమీద నిలవలేక కింద పడితేనో?" అన్నాడు గోపాలుడు.

"అయ్యో, నాయనా! నేనామాత్రం ఆలోచించలేదా? ఆవుకొమ్ములకి కట్టిన పలుపు యింటి కప్పులోనుంచి దూర్చి, నా నడుముకు కట్టుకున్నాగా!" అన్నది ఆమనిషి.

సరే కానిమ్మని గోపాలుడు ఆమనిషికి సాయంపట్టి ఆవును కప్పెక్కించాడు. అనుకున్నట్టే కొద్దిసేపట్లో ఆవు కప్పుమీదినుంచిజారి కిందపడింది. ఆమనిషివెళ్ళి కప్పుకు అంటుకున్నది.

"జానకికంటె వెర్రిముండ కనీసం ఒకతైనా ఉన్నది!" అనుకుని గోపాలుడు ముందుకు సాగాడు.



పొద్దూకే సరికల్లా గోపాలుడు మరో గ్రామం చేరాడు. ఆరాత్రి అతన్ని ఒక గొల్లవాడిఇంటో గడపమని గ్రామ పెద్ద సలహా ఇచ్చాడు. గోపాలుడు గొల్లవాడింటికి వెళ్ళాడు.

అప్పుడే గొల్లవాడు మందను తోలుకొచ్చాడు. మందను కొట్టంలోకితోలి, రెండు భుజాలమీదిగాను చేతికర్ర అడ్డంగా పట్టుకుని గొల్లవాడు ఇంటిలోకి పోబోయినాడు. ద్వారబంధానికి గొల్లవాడికర్ర అడ్డొచ్చి వాడు కాస్తా కిందపడ్డాడు. లేచి మళ్ళీ అట్లాగేపడ్డాడు.

ఇదిచూసి గోపాలుడు, "ఏమోయ్, భుజాలమీద కర్ర అడ్డంగా పెట్టుకుని లోపలికిపోతే కర్ర అడ్డం తగలటం లేదూ?" అన్నాడు.

దానికి గొల్లవాడు, 'నీకు తెలీదు, సామీ. ఈ యింటో భూతం ఉండాది. అదినన్ను రోజూ యిట్లానే ఏడిపిస్తది," అంటూ మళ్ళీ మళ్ళీ పడసాగాడు. చిట్టచివరకు పడిలేవలేని స్థితిలో వాడు కర్ర ఈడ్చుకుంటూ, పాకుతూ వెళ్ళాడు.



"జానకికన్న వెర్రిముండాకొడుకు మరొకడుకూడా ఉన్నాడన్న మాట!" అనుకుంటూ మర్నాడుదయం గోపాలుడు మళ్లీ ప్రయాణం సాగించాడు.

రాత్రి పదేసమయానికి గోపాలు డొక గ్రామం చేరాడు. అది పౌర్ణమి వెన్నెల రోజులు. గోపాలుడావూరు చేరేసరికల్లా చంద్రుడు నడినెత్తిన దేదీప్య మానంగా వెలుగుతున్నాడు. గ్రామంలో పౌరులంతా హడావుడిమీద ఉన్నట్టు కనిపించింది. చాదలూ, వలలూ, బొక్కెనలూ తీసుకుని పరిగెత్తి పోతు న్నారు జనం.

"ఎక్కడన్నా కొంపలంటుకుంటు న్నాయా?" అన్నాడు గోపాలుడు ఒక మనిషితో.

"లేదు. గాడిబావిలో ఇంత వెన్న ముద్ద తేలుతున్నది. దానికోసం అంతా పోతున్నారు," అన్నాడు ఆ మనిషి.

గోపాలుడు గాడిబావి దగ్గిరికి వెళ్ళాడు. ఊరంతా అక్కడేఉంది. కొందరు కేకలేస్తున్నారు. కొందరు ఇతరులను పిలుస్తున్నారు. కొందరు కడవలకు కడవలు నీరుతోడి పారబో స్తున్నారు. అంతా కోలాహలంగాఉంది.



ఆ గుంపులోనుంచి తోసుకుని బావి దగ్గిరికివెళ్లి లోపలికి తొంగిచూశాడు. బావినీళ్లలో చంద్రబింబం కనిపించింది.

"అది వెన్న ముద్ద కాదర్రా. చంద్రుడి ప్రతిబింబం," అని గోపాలుడు ఆ మూఢులతో చెప్పాడు. కాని వా ళ్లెవరూ వినిపించుకోలేదు.

ప్రపంచంలో చాలామంది వెర్రి వెధవాయలున్నారనిగోపాలుడు తెలుసు కుని ఇంటికి వెళ్ళాడు. జానకిని పెళ్ళి చేసుకున్నాడు. ఆమె వెర్రివేషాలు సహించటం నేర్చుకున్నాడు. ఇద్దరూ ఎంతోకాలం సుఖంగా కాపరంచేశారు.



# కాకమ్మక్క కథ

ఒకనాడొక ఎరుకలవాడు అడవిలో ఒక కాకిని పట్టుకుని దాన్ని వలలోవేసి వీధివెంట వచ్చాడు. వాడు వీధిచివర ఆగి నేలలో ఒక మేకు పాతి ఆమేకుకు కాకినిపెట్టిన వల కట్టేశాడు. ఈవిధంగా నేలమీద పడిఉన్న కాకిని కాకమ్మక్క చూసింది.

కాకుల్లో ఒక ఆచారం ఉంది. కాలు విరిగిగాని, రెక్కలు విరిగిగాని అసహాయంగా పడిపోయిన కాకిని మిగిలిన కాకులు పొడుస్తాయి. ఆ ఆచారం ప్రకారం కాకమ్మక్క రోడ్డుమీద పడిఉన్నట్టు కనిపించే అడివి కాకిని పొడవటానికి నిశ్చయించుకున్నది. ఈ ప్రయత్నంలో కాకమ్మక్క కాకిని తన్నగానే వలలో చిక్కుకుపోయింది.



ఏంచెయ్యటానికీ కాకమ్మక్కకు పాలుపోలేదు. గట్టిగా అరిచి నాలుగు కాకులనూ పిలుద్దామన్నా, అందువల్ల తనకు ప్రాణాపాయమేగాని మరొకటి లేదు. అందుచేత కాకమ్మక్క భగవంతుడిమీద భారంవేసి కాగలదానికి ఎదురుచూస్తూవుంది.

కాకమ్మక్క వలలో తగులుకోగానే పక్కనే పొంచిఉండిన ఎరుకలవాడు ముందుకువచ్చాడు. వాడు ముట్టుకుంటే మైల పోతుందనే భయంతో, కాకమ్మక్క వాడికందకుండా గెంతటానికి ప్రయత్నించింది. కాని లాభంలేక పోయింది. రెండంగల్లో వాడు కాకమ్మక్కను అందుకున్నాడు. మొలలోనుంచి కత్తి తీసి కాకమ్మక్కను పొడవబోయి



వాడు. కాని వాడిపెళ్లాం అడ్డుపడి, "అప్పుడే చంపమాకు. ఇంకో కాకిని దొరకనీ," అన్నది.

కొద్దిసేపట్లోనే వాళ్ళు మరొక కాకిని కూడా పట్టుకున్నారు. ఎరుకలవాడు కాకమ్మనూ, ఎరుకలిది రెండో కాకినీ పట్టుకుని, "ఎవరికైనా కాకిరెక్కలు కావాలా?" అంటూ ఊళ్లో కేకలు వెయ్యసాగారు.

వాళ్లీవిధంగా వీధివెంట కేకలు పెడుతూ పోతుండగా ఒక ఇంటి ఆసామీ వీళ్లనుచూసి, "ఒరే, ఆ కాకుల్ని వొదిలేస్తినా నీకొక అణా ఇస్తా," అన్నాడు ఎరుకలవాడితో.

అంటే ఎరుకలవాడు, "వీటి రెక్కలమ్ముకున్నా రెండణాలు వస్తాయి దొరా, అణాకే వదలమంటావా?" అన్నాడు.

"వెధవా, కాకుల్ని చంపుకుతింటావుట్రా? ఏంపనిరా? వాటిని ముందు వదిలిపెట్టూ," అన్నాడు ఆసామీ.

"ఇది మా వృత్తిగదా. వాటిని ఎట్లా వొదలమంటావు దొరా?" అన్నది ఎరుకలిది.

"వాటిని వొదిలితే ఒక అణా యిస్తానన్నానుగాదుటే?" అన్నాడు ఆసామీ.



"రెండణాలియ్యి. దొరా. ఇప్పుడే వీటిని వొదిలేస్తాము," అన్నాడు ఎరుకలవాడు.

కాకమ్మక్కకు క్షణమొక యుగంగా ఉంది. ఎరుకలవాడి చేతిలో కాకమ్మక్కను కాకిబావ చూసినా, ఇతర కాకులు చూసినాకూడా చావుతప్పదు. ఎరుకలవాడి చేతిలోనూ చావుతప్పేట్టు లేదు. ఆ ఆసామీ రెండో అణా ఇవ్వటం దగ్గిర పస్తాయిస్తాడేమో. ఎట్లాగురా భగవంతుడా! అనుకున్నది.

ఈలోపుగా ఆ ఆసామీ మనమడు లోపలికి పరిగెత్తుకుపోయి, "అమ్మోయి, మనింటిముందరే, బూచివాడే, కాకుల్ని చంపుతున్నాడేవ్!" అంటూ తల్లికి చెప్పాడు.

"మీ మొహాలుమండా! మీ యిల్లు వల్లకాడుగానూ! మీకేం పొయ్యేకాలమర్రా! మాయింటి ముందర నిండు ప్రాణాలు నిలువునా తీస్తారా? మాయింటికి శనిచుట్టుకోవటానికా? చూడండి మిమ్మల్నేంచేస్తానో?" అంటూ ఆ యిల్లాలు వీధిలోకి వచ్చింది.

తిట్టినా బతిమాలినాకూడా ఎరుకలవాళ్ళు లొంగలేదు. రెండణాలూ ఇస్తేనే కాకుల్ని వొదులుతామన్నారు. చేసేది లేక వాళ్లను తిట్టుకుంటూ ఆ యిల్లాలు రెండణాలు తెచ్చి వాళ్ల మొహాన కొట్టటానికి లోపలికి వెళ్ళింది.

ఈ సమయంలో ఆ వీధిని జాలయ్య అనే రౌడీ కుర్రవాడు వస్తూ ఎరుకలవాళ్లనూ వాళ్ల చేతుల్లో కాకులనూ చూశాడు. చటుక్కున ఎరుకలవాళ్ళదగ్గరి చేతులమీదా ఒక్కసారిగా కొట్టాడు. రెండు కాకులూ కిందపడ్డాయి. రెంటినీ పట్టుకుని జాలయ్య గాలిలోకి ఎగరవేశాడు.

కాకమ్మ ప్రాణం దక్కించుకుని పక్కయింటి కప్పుమీదవాలి జాలయ్యను ఈవిధంగా దీవించింది:

"రౌడీ జాలయ్య కడుపు చల్లగా, పదిమంది ఆడపిల్లల్ని కని, నాలుగు కాలాలపాటు సుఖంగా ఉండాలి. కా! కా! కా!"

ఆ తర్వాత తుర్రుమనఎగిరిపోయింది.





# తండ్రి కొడుకులు



గత సంచిక తరువాయి

ఈలోపుగా సత్యనారాయణ మాటేమిటి? తనతండ్రి బయటికి వెళ్లిపోయి ఉంటాడని రూఢిచేసుకుని సత్యనారాయణ తలుపు కాళ్లా చేతులా తన్నాడు. కాని అవి ఎందుకో చాలా నెప్పిపుట్టాయి. ఇంతలో వంటలక్క వచ్చి తలుపు గొళ్లెం తీసి, "ఇదేమిటిబాబూ. మిమ్మల్ని లోపలపెట్టి తలుపు వేసిందెవరు? ఆ సత్యంకుంక కాదుకదా?" అన్నది.

"నోరుముయ్యి!" అన్నాడు సత్యనారాయణ కోపంతో.

ఎన్నడూ తనని పల్లెత్తుమాట అనని యజమాని నోరుముయ్యి మన్నందుకు వంటలక్క చాలా ఖేదపడింది. పైకి సూర్యనారాయణలాగా కనిపించేది సత్యనారాయణేనని ఆవిడ కేం తెలుసూ?

సత్యనారాయణ చెంగుచెంగున మెట్లెక్కి పైకి వెళ్లటానికని బయలుదేరాడు. తనతండ్రి డబ్బు ఎక్కడపెడతాడో వాడికి తెలుసు. కాని సత్యనారాయణకు చెంగుచెంగున మెట్లెక్కడం సాధ్యం కాలేదు. వొళ్లంతా బరువెక్కినట్టుంది. కాళ్లు లోడీలలాగా అయిపోయాయి. రెండు మూడు మెట్లు ఎక్కి మెట్లమీద బోర్లా పడ్డాడు. కణత బొప్పికట్టింది. మోకాటి మీద చర్మం కొట్టుకుపోయింది. ముక్కుతూ మూలుగుతూ మెట్లన్నీ ఎక్కేసరికి కాళ్లు పీకసాగాయి. రొప్పు వచ్చింది.

"పోనీ, ఆ గారెలూ, ఆవడలూ తినే బయటికిపోదాం" చాలా ఆయాసంగా ఉంది" అనుకున్నాడు సత్యనారాయణ. వంటలక్కను కేకేసి ఫలహారం పట్టుకు రమ్మన్నాడు.

వంటలక్క పళ్లెంలో గారెలూ ఆవడలూ పట్టుకొచ్చి, "ఇప్పుడే కద తిన్నారు? ఇవి పిల్లవాడికోసం ఉంచాను. మీరు మళ్ళీ తింటారా? కడుపునొప్పి వొస్తుందేమో?" అన్నది.

"పుండాఖోర్, నాకు నువు ఫలహారం పెట్టావా? కడుపులో నొప్పిఅని అబద్ధం ఆడాను. నాకోసం ఉంచినవి నాకు పెట్టటాని కేడుస్తావేం? పెట్టక్కడ" అని సత్యనారాయణ గదమాయించాడు. వంటలక్క తన చెవులను తానే నమ్మలేకపోయింది. తన యజమానికి మతి చెడిందని అనుమానంవేసి నౌకరునుపంపి వైద్యుడిని రమ్మని కబురుచేసింది.



వైద్యుడు రావటం మేలే అయింది. ఎందుచేతనంటే ఆదరా బాదరా ఫలహారం తిని సత్యనారాయణ పక్క మీదపడి పొర్లి గింతలు పెడుతున్నాడు, కడుపునొప్పితో. వైద్యుడు కడుపునొప్పికి మందిచ్చి, రాత్రికి వేసుకోమని భేదిమాత్రలుకూడా ఇచ్చి వెళ్లిపోయినాడు.

వైద్యుడు తనను "తమరు, తమరు" అని గౌరవంగా పిలవటం, అంత బాధలో కూడా సత్యనారాయణకు ఆశ్చర్యం కలిగించింది. వైద్యుడు వెళ్లినాక కొద్దిసేపటికి కడుపునొప్పి కాస్త సర్దుకున్న తరవాత, సత్యనారాయణ లేచి బల్ల సొరుగులో తాళపుచెవులు తీసుకుని డబ్బుకోసం బీరువా దగ్గిరికివెళ్లిచూసి, కొట్టినట్టు ఉలిక్కిపడ్డాడు. ఎందుచేతనంటే బీరువా అద్దంలో తనతండ్రి ప్రతిబింబం కనపడింది.

"చచ్చాన్రా, బాబూ," అనుకుని సత్యనారాయణ వెనక్కు తిరిగి చూచాడు. తండ్రి జాడలేదు. మళ్ళీ అద్దంలోకి చూశాడు. అద్దంలో తండ్రిఆకారం మళ్ళీ కనిపించింది. బట్టతలా, మీసాలూ, సులోచనాలూ కనిపించాయి. తనమోహం తడుముతున్నాడు. తనమొహానే మీసాలూ, కళ్ళజోడూ తగిలాయి.

సత్యనారాయణకు తల తిరిగినట్టయిపోయింది. తను ఎట్లాగో తనతండ్రి అయిపోయినాడు. ఈసంగతి తెలియగానే మొదట దిగులువేసింది. కాని మళ్ళీ సంతోషంకూడా కలిగింది. ఇక తను బడికి పోనక్కర్లేదు. దెబ్బలు తినక్కర్లేదు. ఏదిపడితే అది తినవచ్చు. ఎక్కడికిపడితే అక్కడికి పోవచ్చు. డబ్బు! ఇక డబ్బంతా తనదే! సంతోషంతో ఒక్క గంతు వెయ్యబోయి ఉప్పున కూలబడ్డాడు సత్యనారాయణ.

ఇప్పుడు వాడికి మరో ఆలోచన కలిగింది. తను తనతండ్రిగా మారిపోతే తన తండ్రి ఏమయినట్టు?

ఈ ప్రశ్నకు సమాధానమల్లే మెట్లమీద అడుగులచప్పుడు వినపడింది. ఎనిమిదేళ్ళ బొట్టికాయి ఒకడు మెట్లెక్కి వస్తున్నాడు. తీరాచూస్తే ఆ మెట్లెక్కివస్తున్నది తనే.

తనతండ్రికి తనస్వరూపం వచ్చిందని సత్యనారాయణ గ్రహించాడు. తండ్రికి మంచిపాఠం నేర్పుదా మనుకున్నాడు. బీరువా తాళపుచెవులు జేబులో దాచేశాడు.

సూరయ్య పైకివచ్చి తన ప్రతిబింబం లాగా నిలబడిఉన్న కొడుకునుచూసి నవ్వ సాగాడు. సత్యనారాయణకు నవ్వురాలేదు. భయంవేసింది.

"మనం ఇట్లా ఎందుకయినామో నీ కేమైనా తెలుసునా?" అన్నాడు సూరయ్య.

సత్యనారాయణ మొహంచిట్లిస్తూ "నాకు తెలీదు" అన్నాడు.

"పెద్ద చిక్కే వచ్చిపడింది. నువ్వే నేననీ నేనే నువ్వనీ మనం ప్రపంచాన్ని నమ్మించటం చాలా ఇబ్బంది అయేటట్టున్నది. నేను బోలెడన్ని వ్యవహారాలు నడపాలి. డబ్బు వసూలుచేస్తూ ఉండాలి. నాకు చేతినిండా పనులున్నాయి. ఊరి నిండా స్నేహితులున్నారు. ఈ పనులన్నీ ఈ అవతారంతో ఎట్లాచెయ్యను? అందరి దగ్గిరికీ ఎట్లావెళ్లను? ఒకవేళ కష్టపడి నేను ఫలానా అని అందరికీ రుజువుచేసుకున్నా వాళ్లునన్ను మామూలుగా చూడరే. ఎట్లా?" అన్నాడు తండ్రి.

కొడుకు మొహం చిట్లించి "ఏమో నాకుతెలీదు," అన్నాడు.

"అన్నట్టు నీ చదువుమాటేమిటి?" అన్నాడు సూరయ్య.




"చదువా? ఈ శరీరంతోవెళ్లి నన్ను బళ్ళో కూచోమన్నావా? బాగుంది," అన్నాడు సత్యం.

"ఎట్లా ఏడుస్తుందిరా మరి? నువు బళ్ళోకి వెళతావో, మానుతావో. చదువుకోకపోతే నీ ఖర్మాన నువే పోతావు. నావ్యవహారాలు నేనుచూసుకోక తప్పదు," అంటూ సూరయ్య దేనికోసమో డ్రాయరు సొరుగులో వెతకసాగాడు.

తన తండ్రి బీరువా తాళాలకోసం వెతుకుతున్నాడని సత్యం ఎరుగును. కాని చూస్తూ ఊరుకున్నాడు.

"బీరువా తాళాలు చూడలేదుగదా?" అన్నాడు తండ్రి తల పైకెత్తి కొడుకును చూసి.



"నేనుతీసి దాచానులే" అన్నాడుసత్యం.

"నువుతీసి దాచటమేమిటి? నీమొహం! ఇట్లాతే," అన్నాడు సూరయ్య.

"నువు నాతో మర్యాదగా మాట్లాడటం మంచిది. ఇదివరకల్లా నన్ను ఏమీతెలియని వాజకింద కట్టేశావు. ఇకముందు నాతో మర్యాదగా మాట్లాడకపోతే నేనూరుకోను. పట్టుకు తన్నేస్తాను. తన్నటం ఇక నావంతు. నా మర్యాదమాట ఎట్లాఉన్నా, ఇంతవాణ్ణి నన్నుపట్టుకుని నువు 'నీమొహం, నీమోర' అంటుంటే ఇంటో వంటలక్క దగ్గర్నుంచీ నా చెవులకు పిడకలు కట్టేస్తారు. నేనది సహించను. నా చాతనయినట్టు ఇంటివ్యవహారాలు నేనేచూస్తాను. నాకెన్నడూ ఒక్క ఎర్రఏగానీ ఇచ్చిఎరగవు. అదేమిటో ఇకముందు నీకే తెలిసివస్తుంది. రేపటినుంచీ నాబదులు నువే బడికిపోయి చదువుకో. బడిపంతు లెటువంటివాడో అదికూడా నీకు తెలిసివస్తుంది," అన్నాడు సత్యం.

ఈమాటకు సూరయ్య మండిపడ్డాడు.

"యాభైఏళ్ళొచ్చి నన్నిప్పుడు పోయి రెండోక్లాసు చదువుకోమంటావురా?" అన్నాడాయన.

"చదువురాని నాకన్న అంతచదువూచదివిన నీకు మరీసులభంగా?" అన్నాడుసత్యం.

"నేను బడికిపోను," అన్నాడు సూరయ్య ఖచ్చితంగా.

"పోకపోతే మేష్టరువచ్చి పెడరెక్కలు విరిచికట్టి లాక్కుపోతాడు," అన్నాడు సత్యం.

"అంతపనీ చేయిస్తావురా?" అన్నాడు తండ్రి.

"నువు నన్ను చేయించినపనికాదా?" అన్నాడు కొడుకు.

కాస్త ఆలోచించి సూరయ్య, "పంతులు బాగాకొడతాడా?" అని అడిగాడు.

"చచ్చేటట్టు కొడతాడు. పాఠంచదివినా కొడతాడు, చదవకపోయినా కొడతాడు. 'దండం దశగుణంభవేత్' అని ఆయన సిద్ధాంతం. మన మంచికోసం కొడతాడు. తన చేతితీట తీర్చుకోవటానికి కొడతాడు. ఏమీతోచకపోయినప్పుడుకూడా కొడతాడు," అన్నాడు సత్యం.

"నన్ను పంతులుకొడితే?" అన్నాడు సూరయ్య దిగులుగా.



"నన్ను కొట్టినప్పుడో?" అన్నాడు సత్యం రోషంగా. "దెబ్బలుకొట్టటందగ్గిర వెనకాడ వద్దని ఆయనతో నువుచెప్పలా?"

రూపాలుమారటం అలుసు తీసుకుని తనకొడుకు తనమీద ఇట్లా పగ తీర్చుకోవటానికి ప్రయత్నించటం చూస్తే సూరయ్యకు మండిపోయింది. కాని ఏంచెయ్యటానికీ పాలుపోలేదు.

"నీ వేషాలు నేను సాగనిస్తా ననుకున్నావా? నేనెవరో నువ్వెవరో యిప్పుడే అందరికీ చెప్పేస్తాను. సులభంగా తప్పించుకుందా మనుకున్నావుగామాలు.' అన్నాడు సూరయ్య రోషంతో.

సత్యం బిగ్గిరిగా నవ్వాడు. అతనిధైర్యం హెచ్చసాగింది.

"పిలు, యింటోవాళ్ళందర్నీ పిలు. ఏంచెబుతావో చెప్పు. నువుచెప్పిన నిజమంతా తోసేసి నేనుచెప్పే అబద్ధాన్ని నమ్ముతారు. ఆసంగతి నువే చూద్దువుగాని," అంటూ సత్యం వంటలక్కని కేకపెట్టి పిలిచాడు.

వంటలక్క వచ్చింది.

"చూడు, సీతారామమ్మా, నేను సూరయ్యని. ఇడుగో వీడు సత్యం. మా ఇద్దరి శరీరాలూ మారాయి" అన్నాడు సూరయ్య వంటలక్కతో.

వంటలక్క ముక్కుమీద వేలేసుకుని, "హారి పిడుగా! నీ కిదేం పొయ్యేకాలం?" అంటూ సత్యంకేసి చూసింది.

సత్యం వంటలక్కనుచూసి నవ్వి, "సత్యం, ఆకలేసి పైత్యానపడ్డాడు. తీసుకుపోయి తిన్నన్ని గారెలూ అవడలూ పెట్టు" అన్నాడు.

"కుర్రకుంక అట్లా పేలుతుంటే మక్కెలు విరగదన్నక గారెలూ, అవడలూ పెట్టమన్నారా? మీఅలుసే వాణ్ణింతవరకు తెచ్చింది?" అంటూ వంటలక్క సూరయ్యను రెక్కపట్టుకుని తీసుకుపోయింది.

వంట ఇంటో సూరయ్య వంటలక్కకు నిజం తెలియజేయాలని విశ్వప్రయత్నం చేశాడు. కాని లాభం లేకపోయింది. ఆ తరవాత ఇంటో పనిచేసేవాడితోకూడా మాట్లాడాడు.

"ఒరే, వీరాయ్, నేను మీయజమానినిరా. సూరయ్యను" అన్నాడు సూరయ్య.

వీరాయి కన్నుమలిపి, "అందుకు సందేహమేమిటి, దొరా?" అన్నాడు.

"నిజంగారా!" అన్నాడు సూరయ్య.

వీరాయి మరింత విశాలంగా నవ్వి వెళ్ళిపోయినాడు.

సూరయ్యకు మతి పోయినట్టయింది. ఎవరూ తనమాట నమ్మకపోగా తను అన్నమాటలు తన కొడుకుతో చెప్పేశారు.

ఆ రాత్రి సత్యం సూరయ్యతో, "నువ్వు తొందరపడి అందరితోటీ జరిగింది చెప్పేయ్యకు. వెర్రెత్తిందని అందరూ నిన్ను వెర్రాసుపత్రికి పంపమంటారు. మాట్లాడకుండా ఊరుకో. జరిగేదేమిటో జరగనీ" అని సలహా చెప్పాడు.

[ఈ కథ ఇంకావుంది]






కొన్నాళ్లపాటు నక్కబావ అక్కడా అక్కడా తిరుగుతూ, దొరికినది తింటూ ఏదోవిధంగా కాలక్షేపంచేసింది. ఒకరోజు రాత్రి నక్కబావ ఒకదారిన పోతూ ఉండగా ఒక గుడిసె కనిపించింది. ఆ గుడిసె ఒక నిరుపేద బ్రాహ్మడిది. ఆ బ్రాహ్మడికి ఏడుగురు ఆడపిల్లలు. నిరుపేద కావటం మూలాన ఒక్క కూతురికైనా పెళ్ళి చేయలేకపోయినాడు బ్రాహ్మడు.

బ్రాహ్మడూ బ్రాహ్మడిభార్యా ఈవిధంగా మాట్లాడుకోవటం నక్కబావకు వినిపించింది.

"ఏజన్మాన ఏంపాపం చేశామో, ఇంత మందినికన్నాం.ఒకపిల్లకూ పెళ్లిచెయ్యలేం. ఒకపిల్లకూ తిండిపెట్టలేం. పెద్దప్రాణాలు మనమాట ఎట్లాఉన్నా పసివాళ్లు వాళ్లకైనా కడుపుకు ఇంత తిండి పెట్టలేకుండా ఉన్నామే!" అన్నది బ్రాహ్మడి భార్య.

"ఏడుగురు పిల్లలకూ తిండి పెట్టటం నాచేతకాదు. వాళ్ళకు సంబంధాలు తీసుకురావటం అంతకన్నా చాతకాదు. అందుచేత దారేపొయ్యే ఏ నక్కకో, కుక్కకో ఇచ్చి వీళ్లందరి పెళ్లిళ్లూ చేసేస్తాను," అని గొణిగాడు బ్రాహ్మడు.

ఈమాట వినేసరికి నక్కబావకు చాలా సంతోషమయింది.ఉట్టుడియంగా భార్యను సంపాదించుకోవచ్చు ననుకున్నది. మర్నాడు తెల్లారుజాముననే నక్కబావ బ్రాహ్మడి వాకిలితలుపుతట్టి, "ఏమయ్యా, బ్రాహ్మడా! నేను దారేపొయ్యే నక్కను. నాకు నీకూతుర్నిచ్చి పెళ్ళిచెయ్యి" అన్నది.

నక్కబావ మాటలకు బ్రాహ్మడు నిర్ఘాంతపోయినాడు. రాత్రి విసుగులో అన్నమాటలు ఆ బ్రాహ్మడికి జ్ఞాపకంలేవు.

"మాఅమ్మాయిని నీకివ్వటమేమిటి? నీవు మనిషివికూడా కావు. పో, పో!" అని బ్రాహ్మడు బెదిరించాడు.

"అయ్యో, బ్రాహ్మడా! పొద్దునే లేచి అబద్ధం ఆడతావా? నేనంటే జిత్తులమారి నక్కను. నువు ఆడితప్పని సద్బ్రాహ్మడివే. దారేపోయే నక్కకైనా యిచ్చి నీకూతుర్ని పెళ్ళిచేస్తానని నువు రాత్రి అనలేదా?" అన్నది నక్కబావ.

"అది మాటవరసకన్నమాట. దాన్ని నిజంగా తీసుకుంటారా? ఇన్నేళ్ళు కని పెంచిన కూతుర్ని నక్కవాత వేసేదా?" అని వాపోయాడు బీదబ్రాహ్మడు.

"నీ కూతురిభారం మరొకరిమీద పడటమేకదా నీకు కావలిసింది? నక్కయితే నీకేం? మనిషయితే నీకేం?" అన్నది నక్కబావ.





"మా కూతుర్ని మేమే పోషించలేక పోతిమే? నువ్వేం పోషించగలవు?" అని బ్రాహ్మడు అడిగాడు.

"పెళ్ళాన్ని పోషించుకోలేకపోతే పెళ్ళాడ తానని వచ్చేవాణ్ణా?" అన్నది నక్క బావ.

అడినమాట తప్పకుండా బ్రాహ్మడు తన పెద్దకూతుర్ని నక్క బావ కిచ్చి పెళ్లి చేశాడు. బ్రాహ్మడికూతురు నక్క బావ వెంట కాపరానికి వెళ్లిపోయింది.

కొద్దిరోజులు గడిచాయి. ఇంట్లో ఒక మనిషి తగ్గిందన్న సంతోషంలేదు. బ్రాహ్మడి కుటుంబం దరిద్రబాధకూ అకలిబాధకూ తట్టుకోలేకుండా ఉంది. బ్రాహ్మడిభార్యకు పెద్దకుమార్తెను గురించి విచారంకూడా నానాటికీ జాస్తి అయింది. "అయ్యో, మా కూతుర్ని బతికిఉండగానే నక్కపాత వేస్తిమే," అని అవిత శోకాలు పెట్టసాగింది.

తనకూతురు ఎట్లా ఉన్నదీ చూడటానికి బ్రాహ్మడు ప్రయాణమయ్యాడు.

తన మామగారు తనకోసం వస్తున్న సమాచారం కనిపెట్టి నక్క బావ ఎదురు వచ్చి బ్రాహ్మణ్ణి ఒక రాతిమీద కూర్చోపెట్టి కుశలప్రశ్న చేసింది.

"మా అమ్మాయి ఎక్కడ? మీ యిల్లెక్కడ? కులాసాగా ఉందా? అసలు జీవించిఉందా?" అని బ్రాహ్మడు ఆదుర్దాగా అడిగాడు.

"మీ కూతురుగురించి మీకేమీ చింత అవసరంలేదు. కులాసాగానే ఉంది. ఇక్కడే ఉండండి. ఇప్పుడేతెస్తాను. మీరు



మాత్రం మాయింటికి రావటానికి వీల్లేదు" అని నక్కబావ వెళ్ళిపోయింది.

కొద్దిసేపట్లో నక్కబావా బ్రాహ్మడి కూతురూ తిరిగివచ్చారు. తన కుమార్తె చక్కనిదుస్తులు,నగలు ధరించి ఉండటం చూసి బ్రాహ్మడు చాలా సంతోషించి, "అల్లుడా! నిన్నుగురించి ఏమేమో భావించాను కాని, నీవు చాలా మంచివాడివి. మేమంతా ఆకలితో అలమటపడుతున్నందున మాకేదైన దారిచూపించుదూ" అని బ్రతిమాలాడు.

"దొంగతిండితినే నక్కను, నాదగ్గిర మాత్రం ఏముంటుంది? ఒక దానిమ్మ పండిస్తాను. దాన్ని తీసుకుపోయి దొడ్లో పాతండి. అది త్వరలోనే వృద్ధియై మంచి కాపు కాస్తుంది. ఆ పళ్ళు అమ్ముకుంటే మీ దరిద్రం తీరుతుంది." అన్నది నక్క.

బ్రాహ్మడు నక్కబావ ఇచ్చిన దానిమ్మ పండు తీసుకునివెళ్ళి ఆ రాత్రే దాన్ని దొడ్లో పాతేశాడు. మర్నాడు తెల్లవారి చూసేసరికి వాళ్ల ఆశ్చర్యమేమిటి? దానిమ్మపండు పాతినచోట పెద్ద దానిమ్మచెట్టున్నది. దాని నిండా దానిమ్మపళ్లు విరగకాచి పక్వానికి వచ్చి ఉన్నయ్.

ఇది చూడగానే బ్రాహ్మడికి సంతోషం వేసింది. అయన వెంటనే ఆవూరి సెట్టిదగ్గిరికిపోయి, "సెట్టిగారూ, సెట్టిగారూ. మా దానిమ్మచెట్టుకు కాయలు కాశాయి. మీరు ఖరీదుచేస్తారా?" అని అడిగాడు.

సెట్టిగారికి దానిమ్మకాయ వ్యాపారం చెయ్యాలని ఉద్దేశం లేదుగాని, రెండు కాయలు మోసరాకు దొరికితే గర్భిణిగా ఉన్న తన యిల్లాలికి ఇద్దామని దుర్బుద్ధి పుట్టింది. అందుచేత సెట్టివచ్చి రెండు కాయలు కోసుకుని, "మంచి సరుకైతే నేనే తీసుకుంటాను," అని చెప్పి ఇంటికి వచ్చాడు.

సెట్టి భార్య ఆ దానిమ్మ కాయలు వొలిచిచూసేసరికి ఆమె ఆశ్చర్యమేమిటి? ఆ దానిమ్మకాయలో విత్తులన్నీ కెంపులే! రెండోకాయ వొలిస్తే అందులోవన్నీ తెల్లటి వజ్రాలు!

అవి చూడగానే సెట్టికి ఎక్కడలేని ఆత్రమూ కలిగింది. బ్రాహ్మడికి ఈ రహస్యం తెలిసేలోపుగా దానిమ్మచెట్టు కాయలన్నీ పిందెలతోసహా కొనివెయ్యటానికి సెట్టి బయలుదేరాడు.

సెట్టిగారు కాయలన్నీ కొంటాననేసరికి బ్రాహ్మడికి చాలా సంతోషమయింది. సెట్టి కాయలన్నీ కోయించుకుని చెట్టు దులిపేశాడు. బ్రాహ్మడి పిల్లలు రుచిచూడటానికి రెండు ఉంచమన్నను వినలేదు.

"దానిమ్మగింజలతో కడుపు నిండుద్దా? నేను మీకు కావలసిన సంబారాలన్నీ దానిమ్మకాయల ఖరీదుకు పంపుతాగా!" అన్నాడు సెట్టి.

అల్లుడు చాలా గొప్ప సహాయంచేశాడని బ్రాహ్మడికుటుంబం చాలాసంతోషించింది. ఏరోజు కారోజు తెల్లవారేసరికల్లా చెట్టు నిండా దానిమ్మకాయలుండేవి. కోమటి వచ్చి అవన్నీ కోసుకుని పట్టుకెళ్ళి బ్రాహ్మడి కుటుంబానికి ఆరోజుకు సరిపోయే స్వయంపాకం పంపేవాడు.

ఇట్లా కొంతకాలం గడిచాక ఋతువు అయిపోయి దానిమ్మచెట్టు కాయలు కాయటం మానేసింది. కోమటి ఇంటి





నిండా కెంపులూ, వజ్రాలూ రాసులు తయారయాయి. బ్రాహ్మడి కుటుంబానికి ఎప్పటి దరిద్రమే మిగిలింది. పిల్లలు మళ్లీ ఆకలికి అలమటించసాగారు.

అందరిలోనూ ఆఖరుపిల్ల ఆకలికి తాళలేక దానిమ్మచెట్టున ఇంకా ఒకటీ అరా పిందెలు మిగిలి ఉన్నయ్యేమోనని వెతికింది. వెతికితే రెండు దానిమ్మపళ్ళు ఆకులసందున కనిపించాయి. సంతోషంతో ఆ పిల్ల ఆ రెండు పళ్లూ కోసి తినటానికి పగలగొట్టేసరికి దాని అశ్చర్యమేమిటి? వాటిలో ధగధగా మెరుస్తూ రత్నాలు!

ఈసంగతిచూసి సెట్టి తనను మోసగించాడని బ్రాహ్మడు కనుక్కొని సెట్టిగారింటికి వెళ్ళాడు. "నాకు స్వయంపాకాలిచ్చి రత్నాలు పోగుపోసుకుంటావా?" అని సెట్టి నడిగాడు. "నీ రత్నాలు నాకుతెలీదు. అవతలికిపో," అని సెట్టి బ్రాహ్మణ్ణి వీధిలోకి గెంటాడు.

"అయిందేదో అయిపోయింది. ఈ రత్నాలను అమ్మి సొమ్ము చేసుకుందాం," అన్నది బ్రాహ్మడి భార్య.

సరేనని బ్రాహ్మడు రత్నాలు అంగవస్త్రం కొంగున మూటకట్టుకొని షరాబు దగ్గిరికి వెళ్ళాడు.

అన్ని రత్నాలు చూడగానే షరాబు కళ్ళుకుట్టాయి. "దొంగ బ్రాహ్మడా! నా రత్నాలు కాజేసి మళ్ళీ నాకే అమ్మజూపుతావా? ఎవరు దొంగలించారా అని నేను అల్లాడుతున్నాను. నీపనేనా? పద తలారి దగ్గిరికిపోదాం," అని దబాయించాడు.

"అయ్యో, ఇవి నా రత్నాలు. మా దానిమ్మచెట్టుకు కాశాయి," అని మొత్తుకోసాగాడు బ్రాహ్మడు. అక్కడఉన్న వారంతా ఈ మాటకి నవ్వారు.

"ఆమాట తలారికి చెబుదూగాని! దానిమ్మచెట్టుకు రత్నాలు కాశాయంటే ఎవరు నమ్ముతారు? నీవంటి పేదవాడికి దొంగతనం చెయ్యకుండా ఇన్ని రత్నాలెలా దొరికాయి?" అని షరాబు అడిగాడు.

బ్రాహ్మడు నీరుకారిపోయాడు. రత్నాలు దానిమ్మచెట్టునే కాశాయని రుజువు చేతామంటే చెట్టు కాపుడిగిపోయింది. చేసేది లేక దుఃఖిస్తూ బ్రాహ్మడు రత్నాలుకోల్పోయి వట్టిచేతులతో ఇంటికి తిరిగివచ్చాడు.

"ఎంతమోసం జరిగిందీ! పోనివ్వండి, మళ్ళీ అల్లుడుగారి దగ్గిరికివెళ్లి మాట్లాడండి. ఆయన ఏం సలహా చెబుతాడో చూదాం!" అన్నది బ్రాహ్మడి భార్య.

నక్కబావ బ్రాహ్మడికి ఎట్లా సహాయం చేసేదీ ముందు చూతాం.



# తెనాలి రామలింగం

బ్రహ్మరాక్షసిని ఉచ్చాటన చేసిన వారికి వేయి వరహాలిస్తామని రాయలవారు చాటింపు వేయించారని క్రిందటినెల చదివారు గుర్తుందా? సరే. ఈ చాటింపు వేయించిన నాల్గు రోజులకు, గడ్డాలూ, మీసాలు పెంచుకుని, మొఖాన రూపాయ వెడల్పున కుంకంబొట్టు పెట్టుకుని కాషాయ గుడ్డల్లో ఓ భూతవైద్యుడు రాయలవారి దగ్గరకు వచ్చాడు.

"బ్రహ్మరాక్షసిని, ఏలినవారు అనుమతిస్తే, నేను ఉచ్చాటన చేయగలను" అన్నాడు భూతవైద్యుడు.

"అలాగే కానివ్వు. కాని అన్యాయంగా రామలింగాన్ని త్వరపడి చంపించాను" అన్నారు రాయలవారు విచారంగా.

"తమరు విచారించవలసిన పనిలేదు. అంతగా అవసరమని సెలవిస్తే ఆ బీద బ్రాహ్మణ్ణి బతికించే శక్తికూడా నాకు వున్నది" అన్నాడు భూతవైద్యుడు.

"అంతకంటే కావల్సింది ఏముందీ? మీవల్ల అయితే, రామలింగాన్ని బ్రతికించండి" అని కోరారు రాయలవారు.

కాని తాతాచార్యులవారికి మాత్రం గుండె ఆగిపోయినంత పనైంది. రామలింగం తిరిగి బ్రతికితే తనకు టాటా కులు కట్టక మానడని ఆచార్యులవారికి తెలుసు. అందుకని "యిప్పుడంత శ్రమ ఎందుకులెండి; ఒకవేళ తమరు శ్రమపడి ఈ వేళ బ్రతికించినా రేపటికల్లా ఏదో కొంటెపని చెయ్యకా మానడు, రాయలవారి ఆగ్రహానికి గురిఅయి తిరిగి చావకా మానడు. అందుకని ఏదో హత్యా పాతకం పోయేందుకని, ఉచ్చాటన, ప్రాయశ్చిత్తంమాత్రం జరపండి." అన్నారు ఆచార్యులవారు తన ఆత్రం అంతా వెళ్ళగక్కుకుంటూ.

"అలాగైతే మరి తెలియక అడుగుతున్నాను. రామలింగం చేసిన తప్పుకే కదా తమరు శిక్షించింది. అలాంటప్పుడు ఈ ఉచ్చాటన, ప్రాయశ్చిత్తం కావా

లని ఈ హడావిడి అంతా దేనికండీ?" అని అడిగాడు భూతవైద్యుడు.

"దానికేమున్నది. ప్రజలమేలు, దేశ క్షేమం కొరకు ఈశాంతి క్రియలు జరపవలసిందే" అన్నారు ఆచార్యులవారు.

"ఆచార్యులవారు చెప్పింది ముమ్మాటికీ నిజం. మరి తమరు ఉచ్చాటన ఎప్పుడు ప్రారంభిస్తారు?" అన్నారు రాయలవారు.

"సెలవైతే, యిప్పుడే ఏలినవారి ఎదట ప్రారంభించటానికి సిద్ధంగా వున్నాను" అన్నాడు భూతవైద్యుడు.

"బ్రహ్మరాక్షసి పూరిపెలపల రావి చెట్టుమీద వుంటే, తమరు ఉచ్చాటన యిక్కడ జరపటమేమిటి?" అని అడిగారు ఆచార్యులవారు కంగారుపడుతూ.

"తమరు కంగారుపడవల్సిన అవసరం లేదు. అదీగాక రామలింగకవి బ్రతికేలాగైతే ఈ ప్రాయశ్చిత్తకాండ అవసరం లేదనికూడా తమరు సెలవిచ్చిందే కదా?" అన్నాడు భూతవైద్యుడు.

"అందుకు సందేహమేమున్నది" అన్నారు ఆచార్యులవారు.

"అలాగైతే ఉచ్చాటన, ప్రాయశ్చిత్తం యిదుగో పూర్తిచేశాను" అంటూ గడ్డాలూ, మీసాలూ పూరపీకు



కుని భూతవైద్యుని వేషంలో వున్న రామలింగం బయటపడ్డాడు.

ఆస్థానంలో వున్నవారంతా అలాగే విస్తుపోయి చూడసాగారు. రాయలవారు తరువాత జరిగినదంతా అడిగి తెలుసుకొని "ఔర పిడుగా, ఎంతపని చేశావు. నీవు చచ్చావని నీభార్యకు ఇస్తూవున్న మనువర్తి ఈవార్తతో ఆపివేయిస్తున్నాను. ఒప్పుకున్నందుకుగాను ఉచ్చాటనకివ్వాల్సిన వేయి వరహాలుమాత్రం యిప్పిస్తున్నాను. ఇకనుంచైనా బుద్ధిగలిగి నడుచుకో" అన్నారు రాయలవారు

దంపినమ్మకు దొక్కిందే కూలి అనుకుని రామలింగడు వేయి వరహాలతో యింటికి చేరుకున్నాడు.




## గంగులు కథ

కొర్దా ప్రసన్నకుమారి, దుర్గాడ.

గంగాయ పాలెం అనేవూళ్ళో గంగులు, గంగమ్మ అని ఇద్దరు భార్యాభర్తలుండేవాళ్లు. వాళ్ళకు గంపెడు సంతానంకూడా వుంది. పాపం గంగమ్మ యిల్లు కదిలి ఎక్కడకన్నా పోతామంటే పిల్లలంతా వెంటబడేవాళ్ళు.

ఒకరోజు రాత్రి అవూళ్లో ఓ హరిదాసు హరికథ చెబుతున్నాడు. గంగమ్మకు హరికథలంటే మాచెడ్డ సరదా. కాని మరి పిల్లలనించి తప్పించుకుని పోయేదెలా? అందుకని భర్తతో అన్నది గదా: "ఏమండీ, ఈవాళ హరికథ అట. మీరైనా పోయి దాసుగారి చెప్పిందంతా జాగ్రత్తగా విని యింటికి వచ్చి నాకు ఒక్క ముక్కకూడా పొల్లుపోకుండా చెప్పండి" అంది. గంగులు సరేనని బయల్దేరాడు.

గంగులు అక్కడికి చేరేటప్పటికి దాసుగారు కథకు సంబంధించిన "గంగులు కథ" అనే పిట్టకథ చెప్తున్నాడు. కథ చెప్తూ చెప్తూ దాసుగారు "వస్తున్నాడు గంగు లొస్తున్నాడయా" అని ఒక పాటలోది మొదటి చరణం ఎత్తుకొన్నాడు. మన గంగులు యిది విని ఆశ్చర్యపడి అలాగే చతికిలబడ్డాడు. దాసుగారు తన ధోరణిలో పాట రెండో చరణం "కూర్చున్నాడు గంగులు కూర్చున్నాడయా" అని పాడాడు. ఇది వినేసరికి గంగులికి కోపంవచ్చి యింటికి పోదామని నిలబడ్డాడు. దాసుగారు మూడో చరణం "నిలబడ్డాడు గంగులు నిలబడ్డాడయా" అని పాడాడు. ఇక అక్కడ వుండలేక మన గంగులు అక్కణ్ణించి యింటికి పోబోయాడు. దాసుగారు ఆఖరుచరణం "పోతున్నాడు గంగులు పోతున్నాడయా" అని పాడాడు.

ఈలోగా, గంగులు యింట్లోలేడని తెల్సుకుని గంగులింటికి కన్నం వెయ్యటానికి కొంతమంది దొంగలు గంగులింటి వెనకాలగా వస్తున్నారు.

గంగులు తిరిగివచ్చి యింట్లోకి పోగానే భార్య అడిగింది: "దాసుగారు ఏమి చెప్పారండీ" అని. గంగులు "వస్తున్నాడు గంగులొస్తున్నాడయా" అని పాడాడు. గంగులు పాడినపాటలో 'గంగులు' అనేమాట 'దొంగలు' అని వినపడ్డది దొంగలకి.

ఇది విని దొంగలు చప్పుడుకాకుండా గోడ వెనకాల కూచున్నారు. గంగులు "కూచున్నాడు, గంగులు కూచున్నాడయా" అని పాడాడు. దొంగలు యిదివిని తమల్ని గంగులు చూశాడని పోదామని లేచినుంచున్నారు. మళ్ళీ గంగులు, "నుంచున్నాడు గంగులు నుంచున్నాడయా" అని పాడాడు. దొంగలు యిది విని అక్కణ్ణించి లేచి పోబోయారు. గంగులు "పోతున్నాడు గంగులు పోతున్నాడయా" అని పాడాడు. దొంగలు యిది విని ఒకటే పరుగుతీశారు.

రెండవ బహుమతి పొందిన పోటీ వ్యాసం.






## ఆధారములు

**అడ్డము :**

1. దీని తొనలు తింటారు.
6. పెద్ద చెమ్చా.
7. ఒకట్లు, పదులు, వందలు, ......
9. ఎండకీ, వానకీకూడా కావాలి.
10. రూళ్ళ కర్రతో దీన్ని గీస్తారు.
12. ఇది లేనివాణ్ణి గొర్రె కరుస్తుందని సామెత.
13. కూడ నిధి.
15. సూర్యుడు.
16. కొండజాతి మనిషి.
18. తెల్లని ద్రవపదార్థము.

**నిలువు :**

2. అలంకారము.
3. జలతారు.
4. ఇదిపోతే కరువు.
5. ఈ కథ మీరు చందమామలో చదివి ఉంటారు.
7. వినోదము.
8. సమ్మతించుట.
11. సంతృప్తి.
14. ఏ పనిలోనూ ఇది కూడదు.
16. భీముని ఆయుధము.
17. నివాసము.





నూతన దంపతులకు

నూతన శోభనాలంకారములకు

## శ్రీ లక్ష్మి సిల్క్సు పేలెస్

రాజమండ్రి.

## పనితనమునకు పేరుగాంచిన







ఫ్రాకులు

షర్టులు

హోల్డాల్సు

ది ఇండియా డ్రెస్ మాన్యుఫేక్చరింగ్ కంపెనీ, రాజమండ్రి.

## స్త్రీకి సంతానం సహజమైన కోరిక



# లోధ్ర



దానిని సఫలత నొందిస్తుంది★

లోధ్ర అంతటా దొరుకును



కేసరికుటీరం లిమిటెడ్.

మదరాస్



# బాలోద్యానవనము

మద్రాసు పట్టణంలో తెలుగుపిల్లలకు తగిన విద్యాలయం ఉండేదికాదు. ఈకొరత తీర్చటానికి శ్రీ వి. ఎస్. శర్మగారున్నూ, వారి సతీమణియూ కలిసి 1937 లో "బాలోద్యానవనము" (Children's Garden School) స్థాపించి ఆధునిక బోధనాపద్ధతులపై సాగిస్తూవచ్చారు. 7 గురు పిల్లలతో ప్రారంభమైన ఈ పాఠశాలలో ఈనాడు 580 మంది పిల్లలున్నారు. ఈపిల్లలు ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతాలకూ చెందినవారు.

"బాలోద్యానవనము" ఇంతగా పెరిగినప్పటికిన్నీ అసంఖ్యాకులైన బాలబాలికలు ఇందులోచేరే అవకాశంలేక నిలిచిపోవటం జరుగుతున్నది. కారణమేమంటే ఈపాఠశాలకు స్వంతభవనంలేదు. విశాలమైన స్వంతభవనం ఉన్నపక్షంలో ఈపాఠశాలవల్ల లాభంపొందగల బాలబాలికలు ఎందరైనా ఉన్నారు. ఈవిషయం గుర్తించి మద్రాసులోనూ తదితరప్రాంతాలా ఉన్న ధనికులు భవననిర్మాణానికిగాను శక్తివంచనలేకుండా విరాళాలిస్తున్నారు.

"చందమామ" నిత్యమూ చదివే అసంఖ్యాకులైన పిల్లల తల్లిదండ్రులకు ఇటువంటి పాఠశాలయొక్క ప్రయోజనం సులభంగా బోధపడగలదు. కనుక వారందరూ బాలోద్యానవన భవననిర్మాణానికి యథాశక్తి విరాళాలు పంపప్రార్థన. నూరు రూపాయలకు పైబడ్డ మొత్తములు పంపినవారిపేర్లు "చందమామ" లో ప్రకటిస్తాము.

చందాలు ఈక్రింది చిరునామాకు పంపాలి.


39-43 ఎడ్వర్డు ఎలియట్ రోడ్డు,
మైలాపూరు, మదరాసు.

వి. ఎన్. శర్మ, పి హెచ్. డి.
బాలోద్యానవనము,
(Children's Garden School.)

Printed and Published by B. N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras 1.
Editors CHAKRAPANI and K. RAJA RAO.



*Chandamama Nov. '47* *Photo by Moorthy Vasan*

దీపావళి వేడుకలు

